శ్రీ

# దాశరథివిలాసము.



ప్రథమభాగము.

ఇది

శ్రీమద్వేంకటేశ్వరచరణసేవానురక్తుండగు,

శ్రీరాజారావు చెల్లయ్యమ్మారావు
బహద్దరు జమీందారిణీవారి
యాశ్రితుండును

పిఠాపురసమీప చెందుర్తిగ్రామ నివాసియునగు

కొత్తపల్లి లచ్చయ కవిచే

రచియింపఁబడి

మంజువాణినుండి పునర్ముద్రితమయ్యెను.

(మొదటి కూర్పు)

మంజువాణీ ముద్రాక్షరశాల,

ఏలూరు.

దీనివెల 12 అణాలు. 1911 సం॥

*Printed by —*
N. Chalapati Row.

శ్రీ

# దాశరథివిలాసము.

ప్రథమభాగము.

ఇది

శ్రీమద్వేంకటేశ్వరచరణసేవానురక్తుండును,

శ్రీరాజా రావు చెల్లయ్యామ్మారావు
బహద్దరు జమీందారిణీవారి

యాశ్రితుండును

పిఠాపురసమీప చెందుర్తిగ్రామ నివాసియునగు

కొత్తపల్లి లచ్చయ కవిచే

రచియింపఁబడి

మంజువాణినుండి పునర్ముద్రితమయ్యెను.

(మొదటి కూర్పు)

మంజువాణీ ముద్రాక్షరశాల,

ఏలూరు.

దీనివెల 12 అణాలు. 1911 సం॥

Printed by—N. Chalapati Row.

# పీఠిక.

ఈ కవి ధూమశకటము మనవైపులకు రాకపూర్వము 10 సంవత్సరములక్రిందట కాలినడకను పెద్దతిరుపతియాత్ర వెళ్ళి శ్రీమద్వేంకటేశ్వర స్వామివారిని దర్శించివచ్చి యీగ్రంథము నా స్వామివారికిఁ గృతియిచ్చి రచియింపఁ బ్రారంభించి ఎడతెగని కుటుంబకష్టవిచారములలోను, దేహమునఁగల జబ్బులోను మునిఁగి యుండుటచే మధ్యమధ్య నాగిపోవుచుండెను. మిత్రులప్రోత్సాహమున మరల మొదలుపెట్టుచు రచియించుచు రాగాఁ బదిసంవత్సరములకు గ్రంథము సమాప్తిసెందెను. ఈగ్రంథకర్త యేశాస్త్రమునుగాని, ఏభాషనుగాని, గురువులచే నేర్చి బహుగ్రంథపఠనమున శాస్త్రజ్ఞత్వమును, భాషాజ్ఞత్వమున, సంపాదించుకొనెను. గ్రంథకర్త తనకాలమునను న్న పండితకవీంద్రులలో బ్ర॥ ఆల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారిని బ్ర॥ దేవులపల్లి సుబ్బారాయ శాస్త్రిగారిని, వీరితమ్ములను మాత్రమే ముఖపరిచయము గలిగియుండెఁగాని యితరులను యెఱుఁగఁడు. స్వగ్రామమగు చెందుర్తిని విడచి సమీపమునఁగల పిఠాపురము, కాకినాడ మొదలగు పట్నములలో నొక్కదినముండుటకూడ గ్రంథకర్తకు అలవాటులేదు. ఈ దాశరథివిలాసమును రచియించుటలో పొలములవెంబడిని యూరిలోను తిరుగుచుండియే హృద్గతముగా నిరువది యేబది పద్యములవఱకు అల్లికొనియుంచుకొని కొంచెము స్థిమితముగానున్నప్పుడు, ఎవ్వరియింటనో కూర్చుండియుండి అచ్చట నే తాటియాకును గంటమును తెప్పించి యాపద్యముల నెక్కించి వారియింటనే యెచ్చటనో పెట్టి మరల కొన్నిదినములకు ఎక్కువస్థిమితమును జూచుకొని వానినన్నిఁటిని జేర్చి యొకపెద్దతాటియాకు సంపుటమున వ్రాయుచు వచ్చుచుండెను. గ్రంథము ఇట్లు సమాప్తినైనపిమ్మట కాకితపుబుక్కుమీఁద సాంగముగా నెక్కించెను. గ్రంథకర్తమరణాంతము వరకును గ్రంథమందును కృతినాథునియందును ఎక్కువ భక్తిశ్రద్ధలతో నుండె

నటకు కృతికర్తసోదరులకుఁ గాన్పించిన దృష్టాంతములు పెక్కులుఁ గలవు. గ్రంథకర్తకు గ్రంథమును వ్రాయుటలోఁ జిక్కులు వచ్చి యాతంకము కలిగినట్లె మాకును దీని ముద్రాపణమందుఁ జాలయడ్డంకులు వచ్చినవి.

ఈ గ్రంథము చాలపెద్దదియగుటచేత నొక్క సంపుటముగా నుండిన వీలుగానుండదని మొదటిరెండాశ్వాసములను ప్రథమ సంపుటముగాఁ దయారుచేసితిమి.

ఆఱవయాశ్వాసము చాలపెద్దది యగుటచే దానిని వేఱుగ సంపుటముచేయుటకు విడిచిపెట్టితిమి.

దుష్కరప్రాససూర్యశతకము, చెల్లయ్యమ్మ శతకము, ఈరెండును గూడ నీగ్రంథకర్తచేత మనఃపూర్వకమగు భక్తిచే వ్రాయఁబడినట్లు చదువరులకుఁ దోఁచకపోదు.

పండితప్రకాండు లీ గ్రంథమును సాంగముగాఁ జదివి గుణమును గ్రహించి యానందించెదరుగాక.

ఇట్లు విన్నవించు,

నందిరాజు చలపతిరావు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః.

# దాశరథివిలాసము.

## ప్రథమాశ్వాసము.



మద్గైరికధాతువేష్టితములై-జీమూతసంవ్యాప్తమై।
రామంబైతనరారువేంకటనగేంద్రంబున్హరిద్వారి
పరో। ద్దామంబైమృగనాభిలిప్తమగు ప-ద్మాదేవి
వక్షోజమున్। చామోదిరిచెడి వేంకటేశ్వరుఁడుమ-
మ్మాసక్తిరక్షించుతన్। ౧॥

ఉ. మారుఁగుమారుగాఁగనిన-మాకెనయేసతిపల్కుఁగొమ్మయో।
వారిజహస్తనాయెదకు-వచ్చినదానవునీవయంచుశ్రీ।
జారుఁడుహారకౌస్తుభముఁ-జక్కఁదమార్చ్చనెపంబునందడీ।
యోగుకుచద్వయింబుడుక-నుబ్బెమలచ్చిపసించుమాకడన్॥ ౨॥

చ. శివుఁడనియెల్లవారునుతి-సేయఁగనుగ్రతనీశుభస్త్రము।
రవిశశివహ్నిలోచనవా-రాయుతశంకరిసవ్వనుంగళా।
ప్రవిమలవామ్నివైతగునె-భైరవినాఁజననీశునంచున।
న్భువిహితరాగుఁడైయుమఁగమంగొనుశంభుఁడుమమ్ముఁబ్రోవుతన్

చ. అనుపమబాహుశాఖలశి-ఖాగ్రభవ వారసుమంబులం గన।
ద్వనజవిరోధినిర్గతసు-ధారసపుష్పరసౌఘమాలికా।
ఘనఫలపఙ్క్తులంబొలుచు-కామవిరోధిశరీరకల్పకం।
బునవిలసంగ తేనలత వోలెఁ బెనంగొను గౌరిఁ గొల్చెదన్॥ ౪॥
ఉ. నందకధారిపుత్రుఁడు స-నందనముఖ్యులకెల్లఁ దండ్రి గో।
నందననాయకస్తుతుఁడు-నందగిరీయుఁ డెప్పుడు మేటి నిర్మలా।
నందమునస్సుఁడెద్రిభవ-నందనవిక్రముఁడైనయాశతా।
నందుఁడొసంగుఁ గావుత ఘ-నంబుగ మాకుఁ జిరాయురున్నతుల్॥ ౫॥
చ. వరచతురాస్యపుణ్యజన-వర్ణదీక్షితసత్యలోకమం।
దిరమ్మదుహంసకస్ఫురిత-దివ్యపదాబ్జప్రవాళహస్తవి।
స్తరవిబుధౌఘనందితల-సత్ప్రితిభారతభారతీసమా।
ఖ్యరహిఁ జెలంగుశారదన-యామయతన్నుఁ జూచుఁ గావుతన్॥ ౬॥
చ. అధికమతిన్భజింతుఁ గలు-షాభ్రమహాబలు నమ్మహాబలుం।
గ్రిథనధరారివిక్రమహ-రన్మహితాంబకు నాహితాంబకు।
న్విధివిహితస్తుతత్రిదివ-వేశ్మగణాధిపు నాగణాధిపుం।
బృథుభయదాంతరాయభుజ-గేంద్రవినాయకు నావినాయకున్॥ ౭॥
చ. పటుతరహర్షపాదపశు-భస్థితిగాంచి ప్రసత్తిసత్ఫలో।
త్కటరసమానిరాఘవక-థాఘనశాఖాహవాసి గైకొకడుం:
జొటజొటఁ దేనియల్లురియు-సొంపున రామునిఁ బల్కుమన్నయ।
వ్వటుమణి నాంజనేయశుక-వర్యము నాత్మఁ దలంచి మ్రొక్కుదున్
సీ. చక్రంబులెవనిచే సంతసంబుగమను,
నెవనిచేఁ జక్రంబు-లేపుఁ జెందు।
వసురాజులెవనిచే-నసమతేజముగాంతు,
రెవనిచే వసురాజు-లెసఁగుచుండ్రు।
విబుధులెవ్వానిచే విందు రెవ్వానిచే,
విందురు విబుధులు-విమలబుద్ధి।

గగనధునీహంస-గతిఁ బొల్చు నెవ్వాఁడు,
హంసాఖ్య నెవ్వఁడు ప్రశంస నొందు।

గీ. వరుణుఁ డెవ్వాని సారథి-యై మెలంగు।
నెవ్వఁ డీల నరుణాభిఖ్య-నెలమి నొందు।
నట్టి త్రైలోక బాంధవుఁ-డనుదినంబుఁ।
గృప మొలక లెత్త నన్ను ర-క్షించుఁ గాత॥ ౯।

చ. వితత గుణాగ్ర నాగుఁ బ్రతి-వీమహితాధునికాసనాతన।
స్తుతహిత గాధువేష్టితవి-శుద్ధమనోముని యోగసంతతే।
ధృతఖలతావిరోధగుణ-దివ్యవిశిష్టలబోధసాధనున్।
న్నలకరుణాసనాగుఁ గురు-నాగుఁ భజింతు నభీష్టసిద్ధికిన్॥ ౧౦॥

సీ. వరుసఁ బ్రహ్లాదాది-పరమభాగవతుల,
వ్యాసవాల్మీకాది-వరనియములఁ'
గౌతమీగంగాది-ఘన పుణ్యనదులను,
భూమ్యాదిపటుపంచ-భూతములను।
గరుడాదిహరిపార్శ్వ-చరులఁ గుమారాది,
కైలాసపర్వతా-గ్రగ్రవరుల।
ద్వాదశాదిత్యుల-వసువుల నెనమండ్ర,
గ్రహములను త్రిమూ-ర్తిబ్రాహ్మణాలను।

గీ. నమరనాయక పావకా-ద్యష్టదిక్పతి।
భులనరుంధతీ మొదలైన-పుణ్యసతులఁ।
బోతనమునన్నయాదిక-పూర్వకవుల,
మఱియుఁ బరగిన పుణ్యుల-ముదిభజింతు॥ ౧౧॥

గీ. అజ్ఞులను దుష్టకవుల నే-లాహసింపఁ।
బ్రాజ్ఞులను సత్కవుల నేల-ప్రస్తుతింప।
దుష్టులని వారి దూషింప-దుష్టుఁ జేయఁగఁ।
బ్రస్తుతికి సంతసింపరు-ప్రబలకవులు॥ ౧౨

క. కృతిసుతుని వేంకటేశునిఁ।
గృతిసాధునిఁ గానొనర్చి కృపవుట్టనమ।
సత్కృతిగావించెదమతిస।
త్కృతియంతటికన్నఁగలదె-యెన్నివిధములన్॥ ౧౬॥

వ. అనిమస్తనోభీష్టమహాదిష్టదిష్టపరిప్రార్థనంబును సత్సంభావనంబును సంక్షేపరూపంబుగానడిపియస్మద్వంశానుకీర్తనంబు గావించెద.

## వంశావళి.

క. ధన్యుఁడువిశ్వామిత్రమునిమా।
ర్గన్యుఁడుసంశ్రితకళావ-దాన్యుఁడఖిలస।
న్మాన్యుఁడుసౌజన్యుఁడుకాం।
డిన్యుఁడువెలయుందపఃప-టిమనధికుండై॥ ౧॥

గీ. అన్వయమిగోత్రరత్నాక-రాబ్జుఁడగుచు।
వేదవేదాంతవిద్యాప్ర-వీణుఁడగుచు।
గోత్రనెంతయుఁబొగడొందెఁ-గొత్తపల్లి।
నారసింహమనీషిమా-న్యమతపోషి॥ ౨॥

క. నరసింహత్వముభర్తా।
దరణత్వముఁగలిగియెట్లు-తానెనయగున।
న్నరసింహుఁడువిబుధాదర।
హరహితుఁడైకొత్తపల్లి-నరసింహునకున్॥ ౩॥

క. అయ్యనవలుమొగములుగల।
జియ్యనదల్పఁదొలిపదువు-చేననఁదగువాఁ।
డయ్యన్నమైలవరపుభో।
గయ్యనెనరుఁగూఁతుఁబెండ్లి-యైతగువేడ్కన్॥ ౪॥

ఉ. శక్తిపరాశరుంగనిన-చాట్పువవెంకమయందుఁ గాంచెవి।
ధ్యుక్తవిధానధుర్యుని వి-షోరగబంధనమంత్రతంత్రసం।
యుక్తసుచర్యునిన్ హిమన-గోపమధైర్యుని భూరిసూరిసం।
సక్తసభాసభావితయ-శస్థగితాశుని వెంకటేశునిన్॥ ౫

ఉ. కన్నకుమారకోటివలి-గౌరవమొప్పఁగ నాదరించుఁ దాఁ।
గన్నకుమారులట్లకడ-కన్నవి సేయుఁగ వచ్చుఁ గంగముం।
గన్నకుమారుమానవకంబున మీఱుచు గ్రొత్తపల్లివెం।
కన్నకుమారులేరనిమ-హామహులెన్నఁ బ్రసిద్ధిఁ గాంచుచున్॥ ౬

సీ. ఒకముఖంబున నేర్చె నోనాల్గు వేదంబు,
లరి బ్రహ్మఁ గాదను-నాగమోక్తి।
వేదాంతయుక్తులు-విని నేర్చికొన్న వాఁ,
డనికుకు మెచ్చఁడ-ధ్యాత్మవిద్య।
ధర్మశాస్త్రంబున-దంబెఱుంగఁడు వ్యాసుఁ,
డని ప్రహసించుస్మృ-త్యధిగములఁ।
దనవారికుపదేశ-మొనరించెనాయని,
ప్రహ్లాదునవ్వ్రశ్రీ-పతిసుభక్తిఁ।

గీ. దనరయెదుటనుమువటముద-గంబొనర్చెఁ।
దక్షకుండనికశ్యపుఁ-డతిమిపలుకు।
సర్పముఖవిషమంత్రప్ర-శక్తియుక్తి।
నతఁడు గేవలుఁడే వెంక-నాఖ్యసూరి॥ ౭

సీ. అతిథియైమాయింటి-కరుదేరఁజాలఁడే,
యీతండు పాపంబు-లింకిపోవఁ।
జెలఁగిమాయూరివ-సించినఁ జాలఁడే,
యీతండుమిసులఁ బ్ర-ఖ్యాతిగాఁగ।
నీతండుమాకుఁజ-న్నిచ్చినఁజాలఁడే,
సకలశాస్త్రార్థము-ల్సంగ్రహింప।

వేడుకనొక్క మా-టాడినఁ జాలదే,
మాతోడనితఁడుజ-న్మసఫలముగ।

గీ. ననుచునూర్జిజనుల్దను-వినుతిసేయ।
వసుధఁగీర్తివహించెన-ద్వైతతోషి।
యమలభాషినిరోషిద-యావిభూషి।
ఘననిగమపరవేషి వేం-కనమనీషి॥ ౮॥

ఉ. అతఁడు మొక్క-రాలవిమ-లాన్వయదుగ్ధపయోధిచంద్రుఁడౌ।
నీతఁడనంగ సంస్తుతివ-హించినయర్క-య పెద్దకూఁతువౌ।
ఖ్యాతచరిత్రభర్మనిభ-గాత్రలసచ్ఛతపత్త్రినేత్రనం।
శాతరణీపవిత్రనుతి-పాత్రనుబ్రహ్మమగోత్రఁబెండ్లియై॥

ఆ. అనఘశీలసాధ్వి-యైనతత్సతియందుఁ।
గాంచెరామగోత్రుఁ-గలితగాత్రు।
వనఘమిత్రుఁ జాత్రు-నమితదోషలతాల।
విత్రునుభయకులప-విత్రుఁబుత్రు॥

క. ఆరాముఁడుపితృభక్తికి।
వారాముఁడుజాఘవారి-కారాముఁడు సా।
త్త్వారాముఁడుగుణనికరపి।
కారాముఁడువిప్రమాత్రుఁ-డాతలపోయన్॥

సీ. అనఘవర్తనరాము-నట్టివాఁడౌఁగదా,
యచలసంధాప్రౌఢి-నట్టివాఁడ।
యాచారమునభీష్మ-నట్టివాఁడౌఁగదా,
యుచితశాంతిస్ఫూర్తి-నట్టివాఁడ।
యాడితప్పమిఁబలి-యట్టివాఁడౌఁగదా,
యౌదార్యశీలత-నట్టివాఁడ।
హరిభక్తిఁబ్రహ్లాదు-నట్టివాఁడౌఁగదా,
యఖిలసమానత-నట్టివాఁడ।

గీ. యనుచుఁ బొగడొందిఖరదూష-ణాపహృతిని
మహిభరతలక్ష్మణాగ్రజ-సత్త్వమునను
వాసిమీఱిన శివధర్మ-వర్ధనమున
రామనామంబుఁ దనకు సా-ర్థకమొనర్చె॥ ౧౨॥

సీ. ఒకులలేమికిఁ జింత-నొందునింతియుకాని,
కలవారిసిరికి వె-క్కసము లేదు
ఆత్మసంస్తుతికల-నైన సేయఁడుగదా,
పరనిందవినుటకొ-ప్పఁడు మనమున
లవమిచ్చిరేని మే-రువుగాఁగ భావించు,
నీయని వారిపై-నీర్ష్య లేదు
అధికదుష్కృత్యని-యందైన సుగుణంబు,
నైకంబుగని వాని-సంస్తుతించు

గీ. ప్రతిగ్రహరాహిత్య-మానిగర్వ
మాప్రమోదనిమగ్నత-యాప్రశాంతి
మానిభృతిరామనసుకృతి-యందకాక
తిరిగి చూచినమఱికల-దే యరులకు॥ ౧౩॥

ఉ. తానమరేంద్రసుస్థిరప-దంబునహింపఁగ రావుసూర్యరా
జ్ఞానవనాథమౌళిమణి-మానక కోరియొసంగినన్సమా
ధానమునాగ మోదితవి ధానముఁ గాంచనసస్యగర్భభూ
దానము రామనార్యుఁడుము-దంబునఁ గాంచెనయాచితంబుగన్ ॥౧౪

వ. ఏవంవిధమహాసుగుణగరిష్ఠుండగు నమ్మహీసురశ్రేష్ఠుండు. ౧౫॥

ఆ. పరమపావనుండు-బ్రాహ్మణప్రవరుండు
నమలవిష్ణువర్ఘు-నాన్వయుండు
ఘనవిహారిగితవి-కారి సుబ్రహ్మణ్య
సూరివరకుమారి-సుగుణహారి॥ ౧౬॥

వేడుక నొక్కమా-టాడినఁ జాలదే,
మాతోడ నితఁడు జ-న్మసఫలము గ।
గీ. వనుచు మునిరాజనుల్దను-వినుతి సేయ।
వసుధఁ గీర్తివహించెన-ద్వైతతోషి।
యమలభాషి నిర్దోషి ద-యావిభూషి।
ఘననిగమపరవేషి వేం-కనమనీషి॥ ౮॥

ఉ. ఆతఁడు మొక్కరాలవిమ-లాన్వయదుగ్ధపయోధిచంద్రుఁడా।
నీతఁడనంగ సంస్తుతి వ-హించినయర్కయ పెద్దకూఁతుని।
ఖ్యాతచరిత్ర భక్తనిభ-గాత్ర లసచ్ఛతపత్త్రనేత్ర నం।
శాతరుణీపవిత్రను తి-పాత్రను బ్రహ్మగోత్రఁ బెండ్లియై॥ ౯॥
ఆ. అనఘశీలసాధ్వి-యైనతత్సతియందుఁ।
గాంచెరామగోత్రుఁ-గలితగాత్రు।
వనఘమిత్రుఁ శాంతు-నమితదోషలతాల।
విత్రునుభయకులప-విత్రుఁ బుత్రు॥ ౧౦॥
క. ఆ రాముఁడు పితృభక్తికి।
నా రాముఁడు జోడు వారి-కా రాముఁడు సా।
త్త్రా రాముఁడు గుణనికరపి।
కా రాముఁడు విప్రమాత్రుఁ-డాతలపోయన్॥ ౧౧॥
సీ. అనఘవర్తనరాము-నట్టివాఁడౌఁగదా,
యచలసంధాప్రౌఢి-నట్టివాఁడ।
యాచారమునభీష్ము-నట్టివాఁడౌఁగదా,
యుచితశాంతిస్ఫూర్తి-నట్టివాఁడ।
యాడితప్పమిఁ బలి-యట్టివాఁడౌఁగదా,
యౌదార్యశీలత-నట్టివాఁడ।
హరిభక్తిఁ బ్రహ్లాదు-నట్టివాఁడౌఁగదా,
యఖిలసమానత-నట్టివాఁడ।

గీ. యనుచుఁ బొగడొందిఖరదూష-ణాపహృతిని।
మహీభరతలక్ష్మణాగ్రజ-న్మత్వమునను।
వాసిమీఱినశివధర్మ-వర్ధనమున।
రామనామంబుఁదనకుసా-ర్థకమొనర్చె॥ ౧౨॥

సీ. ఒకరులేమికిఁజింత-నొందునింతియ కాని,
కలవారిసిరికివె-క్కసములేదు।
ఆత్మసంస్తుతికల-నైన సేయఁడుగదా,
పరనిందవినుటకొ-ప్పఁడుమనమున।
లవమిచ్చిరేని మే-రువుగాఁగ భావించు,
నీయనివారిపై-నీర్ష్యలేదు।
అధికదుష్కర్మని-యంత్రైనసుగుణంబు,
నైకంబుగనివాని-సంస్తుతించు।

గీ. ప్రతిగ్రహరాహిత్య-మానిగర్వ।
మాప్రమోదనిమగ్నత-యాప్రశాంత।
మానిభృతిరామనసుకృతి-యందకాక।
తిరిగిచూచినమతికల-దేవరులకు॥ ౧౩॥

ఉ. తానమరేంద్రసుస్థిరప-దంబునహింపఁగ రావుసూర్యరా।
జ్ఞానవనాథమౌళిమణి-మానకకోరియొసంగిన్నమా।
ధానమునాగమోదితవి ధానముఁ గాంచనసస్యగర్భభూ।
దానమురామనార్యుఁడుము-దంబునఁగాంచెనయాచితంబుగన్ ॥౧౪

వ. ఏవంవిధమహాసుగుణగరిష్ఠుండగునమ్మహీసురశ్రేష్ఠుండు. ౧౫॥

ఆ. పరమపావనుండు-బ్రాహ్మణప్రవరుండు।
నమలవిష్ణువర్ధ-నాన్వయుండు।
ఘనవిహారిగతివి-కారిసుబ్రహ్మణ్య।
సూరివరకుమారి-సుగుణహారి॥ ౧౬॥

క. అంబికకుసాటియగుస
ద్భాంబికధర్మవిధిఁ జెందె-దాయునిజదాంప
త్యంబభివర్ణించెదుగుజ
నంబులఁగనిపొగడు రామ-నవనీశికడుక్॥ ౧౭॥

సీ. కన్నతండ్రికిఁగీడు-గ మెలఁగకుండిన,
దాక్షాయణీదేవి తనకుసాటి।
యత్తమామలసప-ర్యసదాయొనర్చిన,
జనకభూపతిసుత-తనకుసాటి।
ప్రజలభరింపనో-పకబ్రహ్మలోకైన,
విసపింపకున్నను-ర్వితనసాటి।
తానట్టివనుచునం-దఱినోళ్ళఁబడకున్న,
వనభూర్తకారద-తిసకుసాటి।
గీ. కానిపెఱవారుతనసాటి-గారువారుఁ।
గాపురంధ్రిజనవినుతి-ఘనతఁగాంచె।
నమలతరవర్తినీసద-యానువర్తి।
దుర్మతిపపత్ని రామన-ధర్మపత్ని॥ ౧౮॥

క. అలుకయనుపేరయెఱుఁగదు।
కలహామఁగొండియమునీసుఁ-గఠినవచనము।
ల్కాలనైనవెఱుంగదుత।
త్కులపతిసుబ్బాంబకీడె-క్షోణిసుగసతుల్॥ ౧౯॥

సీ. ప్రొద్దునలేచియి-ప్పణ్యాత్మురాలిమొ,
గంబుఁజూచినఁజాలుఁ-గలుషమడఁగ।
వీసాధ్వియాత్రిల-నెదురైనఁజాలును,
సర్వకార్యంబులు-సఫలతగనఁ।
బతిమాలికానిదైన-బసుపింతియీకాంత,
కిడినచోఁజాలుజ-క్కానులుఁదనియ।

నీయమకునమస్క-రించినఁజాలుస,
మగ్రసౌభాగ్యసం-పదవహింప।

గీ. వేశ!-నీసతిగుణములు-విన్నఁజాలు।
వసుమతిఁబతివ్రతలలోన-వన్నెగాఁగ।
ననిసమస్తజనంబుల-వినుతిఁగాంచె।
సుగుణమృదువచనకదంబ-సుబ్బమాంబ॥ ౨౦॥

గీ. పతిహితంబుతనకుఁ-బరమవ్రతంబును।
బతిమనంబుతనకు-బహుధనంబు।
కానివేఱసామ్ముఁ-గలితవ్రతంబును।
లేదుసుబ్బమకును-లేశమయిన॥ ౨౧॥

గీ. అట్టిదగుసుబ్బమపురంధ్రి-యందురామ।
నావనీసురకులముఖ్యుఁ-డప్పకృత్తి।
బహుధనంబన్నయట్టులఁ-బడసెవసుస।
ద్వృత్తులఁబుత్త్రిలనెనమంద్ర-నిద్యయశులఁ॥ ౨౨॥

క. అందఱుసర్వజనప్రియు।
లందఱుసుందరులుసాధు-లందఱుమతివా।
రందఱుసత్యవచనుల।
య్యందఱుదృఢమతులువారి-కందరువేల్పుల్॥ ౨౩॥

క. వీరికిఁదోఁబుట్టువలై।
నారీమాళిమణియైన-నరసమయుఁబుట్టెఁ।
ధ్రీరత్నముబ్రహ్మానుయును।
జారుమతీసుమతులనఁబ్రశ-స్తిఁగనిరిలకో॥ ౨౪॥

వ. అట్టివిశాలయశస్సంతానపరిష్కృతదిశాదశకంబగురామన సంతానద
శకంబునకునగ్రజుండై॥ ౨౫॥

క. ఘనవిద్యాయోగతమహి।
తవయాంచితపాలనాము-దంబునశివధ।

ర్మనిరూఢి నెల్లగుణములు।
జనకునిగతిగాంగనకృతి-జగతినుతిఁగనుక॥ ౧౬॥

సీ. అష్టాదశపురాణ-తుష్టినూతుఁడుసాటి,
క్రోధశాంతికిఁగుశి-కుండుసాటి।
యతిథిపూజారతి-నలముద్గలుఁడుసాటి।
నిందుమతికిఁగుచే-లుండుసాటి।
యద్వైతమతసిద్ధి-శవనివ్యాసుఁడుసాటి।
పటుశోస్యమునవార్క్య-భటుఁడుసాటి।
మృదువచోరచనకు-విదురుండుదనసాటి,
గుణమనీషానూర్తి-గురుఁడుసాటి।
గీ. శ్రుతిహితాచారమునఁబ్రవ-రుండుసాటి।
శాస్త్రిధర్మములకుఁబరా-శరుఁడుసాటి।
గాని పెఱవారుదనసాటి-గారనంగ।
నలరుహితవేషిగంగనా-హ్వయమనీషి॥ ౧౭॥

క. సోదరులుపుత్త్రిలన్యక్ర।
శోదరలఁసహోదరలుస,హోదరలుసుత।
ల్సాదరము మేదురంబనఁ।
గాఁపరవేయిట్టిడను చు-గంగనసుకృతిక॥ ౧౮॥

వ. తత్సహోదరుండై. ౧౯॥

సీ. తనపితృభక్తిసం-ధారూఢిభార్గవ,
రామునామోదవా-శాశవైపఁ।
దనవిలేఖనవిచి-త్రముచిత్రగుప్తున,
కత్యంతవిస్మయం-బావహింపఁ।
దనమూన్పతో క్తిసం-జాతిమజాతశా,
త్రవుగురుమోదవ-దనముఁగూర్పఁ।

దనసౌకుమార్యభా వనభావజన్మున,
కతనుత్వసంతోష-మాచరింపఁ।

గీ. ప్రబలెవైదిక లౌకిక-ప్రతతివినుతి।
శాంధవాద్యతనిష్పత్తి-పాతవిఖ్యాతి।
ననఘుమతిఘునియతిస-త్యాగతినిరతి।
నతిసుకృతిదుష్టనికృతి వెం-కన్న సుకృతి॥ 30॥

వ. తత్సహజన్ముండై. 31॥

చ. సముచితవాదిసర్వజన-సన్నుతచారువినోదిమర్దల।
ప్రముఖసువాద్యమోదిహరి-భక్తికినాదిపరప్రమోదిసం।
శమితనిజాగ్రజానుజవి-షాదిజనేంగితవేదివీతభీ।
దిమధురవాదిసుబ్బనసు-ధీవరగభేదికదున్విరాజిలున్॥ 32॥

వ. ఆతనితమ్ముండై 33॥

క. రామానుజన్నతసుమి।
త్రామోదకవృత్తినగ్ర-జామజభక్తి।
ప్రేమాధికతవనంతక।
రామతిలక్ష్మణుడయనఁగ-లచ్చనతనరున్॥ 34॥

వ. తదనుజుండై. 35॥

సీ. అన్నలకౌకదండు-గైనదాఁటఁడుతమ్ము,
లనుగన్నులనుగప్పి-కొనెడునీతఁ।
డేసీమలోసిరే-యేకార్యములనైన,
దృష్టిమాత్రమునగ్ర-హించునితఁడు।
చింతిచేమునిఁగికృ శింమవారలనైన,
మృదువచోరచనవ-శ్యంమునితఁడు।
భూతచేతాళప్ర-భూతపన్నగదుష్ట,
మృగవృశ్చికవిభీతి-నెఱుఁగఁడితఁడు।

గీ. సకలజనులకుఁ బరమహ-ర్షనిధి యితఁడు।
ముఖ్య వేదాంతచర్యకు-మూలమితఁడు।
నల్పచిత్రకళాపరి-కల్పుఁడితఁడు।
నంగనర్హాన వెలుఁగొందు-నవనియందు॥ ౩౬॥

వ. తత్సోదరుండై. ౩౭॥

సీ. పుష్కరాక్షవిహీన-ముఁ బొరయకుండినఁ,
దగువలభర్తకొం తతులవచ్చుఁ।
తెలియూరఁ గోపత-బిట్టుగిడ్వడకున్న,
మాద్రితో లూచలింత-మాద్రివచ్చు।
వనవాసనియతివి-వర్జిగాకుండిన,
సువసంతుఁడొకసుంత-సవతువచ్చు।
నిజపాదపరిపాళ-ముజనింపకుండినఁ,
గమలవైరిరవంత-సమమువచ్చుఁ।
గీ. గానిత్ర్యంబకు చేతను-గరిమ తెడిన।
పంచపాయకుఁ డెబ్బంగిఁ-బ్రతిమవచ్చు।
ధరణిశుభలక్షణాంగక-స్ఫురణనితని।
కవఁగశ్రీసూర్యరావు పు-ణ్యనిధి వెలయు॥ ౩౮॥

క. కదుభక్తిరతుఁడు సుజనను।
తుఁడు బహుభాషారతుఁడు హి-తుఁడు మహితుఁడు శాం।
తుఁడు మాన్యవ్రతుఁడు నియ।
తుఁడు వాఁగను సూర్యరావు-స్తుతచరితుఁడురన్॥ ౩౯॥

వ. తదనుజన్ముండై ౪౦॥

శా. కామక్రోధవికారదూరిలలితాం-గశ్రీసముంచత్ప్రభా।
కామక్రోధవికార కారిమృదువా-క్యస్స్వైరిసత్సర్వభా।
షాముద్రాక్షరగుంభనాపటిమభా-షామానినీహారియా।
శ్రీమత్సుందరసూరిసూరిపరిష-త్సేవ్యుండుబొల్చుంగదున్॥ ౪౧॥

వ. అతని తోడంబుట్టువై॥ ౪౧

ఉ. ఆనయమున్నయంబు విన-యంబు మితప్రియ వాక్యయుక్తి వి।
జ్ఞానము నాత్మబుద్ధి సద-సత్ప్రదిభావన విష్ణుభక్తి సం।
ధానముఁ జారు గానము వి-ధానము నీక్రియ నెట్టివారికిం।
గానము వేంకటేశ్వరుఁడ గణ్యుఁడు వాఁ బొగడొందు నెంతయున్

సీ. ఏతల్లిగన్నదో-యీసుకుమారుల,
ననిచూచువారు ప్ర-త్యభినుతింప।
నాయమ్మసంతాన-మందఱునందఱే,
యనిసర్వజనములు-వినుతిసేయఁ।
గన్నవారలు నోఁచి-కొన్న నోముఫలంబు,
వశమె వర్ణింప నె-వ్వరికిననఁగఁ।
దండ్రియట్టులకాక-తనయులవృత్తిచే,
బొందుసేయునిబంధు-బృందములర।

గీ. వీరలెదిరినిమదికంద-వీరనంగ।
వీరుకలనైనఁ గల్లలు-వినరంగ।
వీరుమనవల దేపది-వేలకనఁగ।
నలరుదురుజగిమవులురా-మునకొమరులు॥ ౪౪॥

సీ. బీదలవనవలసాదుల-రోగులఁ,
గనుఁగొన్న యంతన-కనికరింతు।
రట్లుప్రేమించితా-రష్టుడువశియైన।
నర్థవ్యయమొనర్చి-యాదరింతు।
రొకతాగానివ్యయం బొకరుసేయరుచేసి,
రేనియదేమని-యెన్నఁడడుగ।
రడుగకున్ననుడాఁప-కంతయువినిపింతు,
రట్లుచెప్పినవిని-హర్షులగుదు॥

గీ. రహాహాయీసోదరులప్రసా-దాభిముఖ్య।
మరవాంఛావిరాహిత్య-మైకమత్య।
మఖిలసజ్జనసాంగత్య-మధికసత్య।
మరయుపాండుతనూజుల-కైనఁగలదె॥ ౪౫॥

కం. మాయూరికి రావలదే।
మాయింటవసింపవలదె-మిముఁగనవలదే।
మాయొద్దఁబలుకవలదే।
యీయన్నయుఁదమ్ములునని-యెంతురుజనముల్॥ ౪౬॥

వ. అట్టి మహామహనీయాభివర్ణనీయ సుగుణసంతానంబును, సంశ్రిత దీనసంతానసంతానంబునగు రామన పుణ్యసంతానంబునం జతుర పుత్త్రుండనగునేను. ౪౭॥

గీ. పరమభక్తినిదుష్కర-ప్రాసకంద।
నూర్యశతకంబువిరచించి-నూర్యదేవ।
తాళికోమణికర్పించి-తద్దయావి।
శేషమాధుర్యకసుధాప్ర-సిద్ధిమతియు॥ ౪౮॥

## షష్ఠ్యంతములు.

---

కం. వ్యాసాదిమునిమనోబ్జా।
వాసునకుందాసలోక-వాంఛితఘటనో।
ల్లాసునకుందుష్టజన।
త్రాసునకుంబ్రథమనోహ-రవిలాసునకున్॥ ౧॥

కం. అతిగితరాత్మసోత్క-ర।
శిక్షునకసద్వృత్తునకుఁబ్ర-సిద్ధతితిక్షా।
దక్షునకుఁదక్షునకుఁబ్ర।
ద్రాక్షునకువ్యేంకటాచల-శాధ్యక్షునకున్॥ ౨॥

క. చిత్రచరిత్రునకు జగ
న్మిత్రోత్పలమిత్రమహిత-నేత్రునకు సద్గ
గ్గాత్రునకుఁ బవిత్రునకుఁ గరి
జైత్రునకున్భక్తపికల-సచ్చైత్రునకున్॥ ౩॥

క. భక్తజనవిసరపోషణ
సక్తమనఃపద్మునకుఁ బ్ర-సన్నతసంప
ద్వ్యక్తాచలసద్మునకతి
రిక్తకకుద్మునకు సంహ-రితఛద్మునకున్॥ ౪॥

క. శీలునకుం జలధిసుతా
లోలునకుం దుష్టధీవి-లోలునకుఁ బ్రభా
జాలునకున్నుతలోచన
ఫాలునకున్సర్వలోక-పరిపాలునకున్॥ ౫॥

ఉ. హారికిరీటచారుమణి-హారికి సన్నివహారికిల్బిషా
హారికిదుష్టసర్పఫణి-హారికినాశ్రితపూరుషప్రతీ
హారికి వేంకటాచలవి-హారికి వార్ధిసుతాసతీమనో
హారికిభక్తదోషపరి-హారికివాస్యసరోరుహారికిన్॥ ౬॥

వ. పరిసమర్పణంబుగా వారచింపందొరకొనిన దాశరథివిలాసంబను మహాప్రబంధకథాప్రారంభం బెట్టిదనిన॥ ౭॥

ఆ. వెలయునజానికరుణ-విమలరామకథాప్ర
పంచ మెల్లఁ గానఁ-బడిన వేడ్కఁ
బ్రచురభంగిఁ జెప్పఁ-బ్రాచేతసుండుకు
భక్రమంబుగాను-పక్రమించి॥ ౮॥

## కథాప్రారంభము అయోధ్యానగర వర్ణనము.

శా. సాకేతాహ్వయరాజధానిజనతా-సంస్తుత్యమైనిష్కుటా।
నేకానోకహసత్ఫలామృతరసా-పేక్షాధికీభూతచే।
తఃకాతూహలతాసమాగతపత-ద్విజ్యారవప్రచ్ఛలా।
స్తోకాభిష్టుతదేవతానికరమై-శోభిల్లుభూభామయై॥ ౧॥
గీ. గురువిబుధరాజవంగన-భరితమగుట।
శుభ్రతరగాభ్రమాతంగ-శోభియగుట।
విమలభాసురవాహినీ-భిత్తియగుట।
వరయగధరామరావతి-యగునయోధ్య॥ ౨॥
గీ. చంపకోత్పలమాలికా-సహితమగుచు।
వాటమగువాట వెలఁదుల-తేటగీత।
ములమహోత్సాహమత్తేభ-ములనయోధ్య।
కృతియుఁబోలెమనోహరా-కృతిఁదనర్చె॥ ౩॥
మ. తలపందత్పురరాజసౌధములుఁబ్రో-ద్యత్పర్వతోత్సేధము।
ల్జలజాతాప్తపథావరోధములుఁగో-సంబాధముల్సంతతా।
కలితానర్ఘ్యమణీసనాథములున-గ్రప్రస్ఫుటాశేఖితా।
ఖిలగంగావరరోధముల్వ్యృశబృహ-త్ఖేయోదకాగాధముల్॥ ౪॥
ఉ. అప్పురసౌధవర్తులగు-వజ్జముఖీముఖశౌష్ఠవప్రభం।
దప్పకకాంచిరేనెలమ-దంబునసామ్యమునొందఁగోరిసాం।
పొప్పఁగనంతషోడశక-శోజ్జ్వలుఁడయ్యుమదస్మఖప్రభం।
జొప్పడలేకసిగ్గునఁగ్రుం-కుంథగుచుండుఁగ్రమక్రమంబునన్॥ ౫॥
క. సగరులతాతలచేతఁబొ।
సఁగిరొయుదచేపడకభంగ-సంగతిలేమిం।
దగుపరిఖుఁబోల్పవచ్చునె।
యగస్త్యచేపడిసభంగ-మగుసాగరమున్॥ ౬॥

మ. సరియౌనిప్పురివియ్యమందెదభవి-ష్యత్కాలమందంచును।
ర్వరత-చ్ఛోభనవీక్షణోల్లసితయై-రానమ్మహాదేవిసం।
భరియింపంగులపర్వతాళిదిగిభ-వ్రాతంబు రాఁబోలుఁగా।
కరదంబుల్ద్విరదంబులే పురమునం-దారీతిఁగన్పట్టెడున్॥ ౭॥

వ. మఱియును. ౮॥

మ. వరదంతద్యుతివిద్యుతిప్రచయము-ల్భాంకారగర్జాధ్వని।
స్ఫురితంబుల్నిరతస్రవన్మదజలం-బుల్పర్వతోత్తుంగసం।
దరనీలద్యుతినద్గతిప్రకరవి-స్తారంబువంబోల్చసిం।
ధురసంతానములభ్రముల్దలఁచిసం-తోషింపఁగానప్పురిన్॥ ౯॥

సీ. ఆవిదితవిగ్రహులం-డైబయల్జరియించు,
వానివాహ్యములజ-వంబదెంత।
జడధిలోఁబ్రభవించి-స్వర్గమందచరించు,
హరిహయహాయసద్ర-యంబదెంత।
ఘనతఁగాంచియుఁజని-చనిహీనతవహించు,
జలదావిలంబిత-చర్యయెంత।
చతుశ్రవాసహ్య-చారియైమీఱున,
మారుతమ్మునిత్వరా-నూనమెంత।

గీ. యనుచురణవిదితులకువా-హ్యంబులగుచు।
జవతవుట్టకదశదిశ-ల్సంచరించు।
చునుగడుంజనిహీనతఁ-గనకఁగనఁగ।
వినఁగయోగ్యతఁగొఱలున-వ్వీటిహరులు॥ ౧౦॥

క. పరుఁడయ్యెనేనినీలాం।
బరుడైనన్విజితభూమి-పకుఠారాడం।
బరుడైనంగడిమిదిగం।
బరుడైనంజెనకువీర-భటులావీటన్॥ ౧౧॥

క. చతురాస్యులు వాగీశులు।
నతిశయపద్మాసనప్ర-సక్తులవనీ।
స్థితికాధారులుసత్యా।
శ్రితులప్పురివిప్రులవ్వి-రించిసమానుల్॥ ౧౨॥

చ. మహితలలాటలోచనులు-మారజితాత్ములుసర్వమంగళా।
వహులుశివాంకులున్నవన-వర్ణులుకఘనపుష్పధారులు।
స్వహితమహాభ్రకేశులుసు-భీములుఁగాంచనశైలధన్వులై।
రహివిహరింతురప్పురవ-రంబుననెంతయురాజశేఖరుల్॥ ౧౩॥

మ. తలఁపందొమ్మిదిపెన్నిధుల్గలిగిమి-త్రత్వక్షుద్రతన్మాన్పలేఁ।
దలయక్షేశుఁడుచూడజడధివా-నాంచన్నిధిప్రాప్తుఁడై।
పొలుపుంజెందియునప్పులంగలఁగఁజేయం-చోయంచునవ్వీటివై।
శ్యులుహాసింతురులెక్కలేనినిధులన్-శుంభద్గుణోజ్జృంభతన్॥

క. భద్రులునిరతాపాస్త।
క్షుద్రులుభూదేవనికర-శుభశుశ్రూషో।
న్నిద్రులునిరుపద్రులువై।
ర్వ్యాద్రులునయగుణసముద్రు-లప్పురిశూద్రుల్॥ ౧౫॥

సీ. రంభమత్ప్రబలోరు-రామణీయతఁగాంచి,
యోడినిసప్సరతి-నొందవలదె।
శశిరేఖమన్ముఖ-సౌకుమార్యముఁగాంచి,
కృశతనానాఁటికి-నిపురవలదె।
హేమాభిధానమ-ద్రామాంగరుచిఁగాంచి,
నిశ్చేష్టయగుచున హిన్నఁజొరవలదె।
హరిణీసమాఖ్యమ-దాలోకనములుగ,
న్గొనిచిక్కికసవేతి-తినఁగవలదె।
గీ. యమరుసౌదామినిమదీయ-మైనసోయ।
గింబుఁగనిడాఁగిచలనంబు-గాంచవలదె।

యనుచువిహరింతురప్పురి-వరిచలితసు।
ధీజనములగు వారనా-రీజనములు॥ ౧౬॥

సీ. వనఁబోణివిను మెత్తి-కొనఁగ నాకిష్టంబు,
ద్రవిణసంపత్తియిం-తటికిమూల।
మలివేణివలపులు-సిలికెడునీకొమ్మ,
తనుమధ్యసుమనస-త్త్వంబుకలిమి।
రమణిగన్గొనఁగనా-కుముదంబుదనరారెఁ,
గరమనురాగంబు-గాఁగఁగొనుము।
పున్నాగముల నేల-పొగడపువ్వుదువాణి,
యేటికిఁబొగడరం-జిల్లుమండ।

గీ. నాలికుచగుచ్ఛముల నేల-యంటనీవు।
వేలయుంబెనుచొకగా-నీనవంగ।
నవుచునర్మోక్తులాడుమ-ననుపుకాంద్రుఁ।
బువ్వులమ్మురమణులన-ప్పురిఁబొలుతురు॥ ౧౭॥

గీ. ఉపరతిక్రాంతపౌరప-యోజముఖుల।
చెమటలార్పంగఁబోయిప-చ్చెడుకతమునఁ।
గరువలితోడంగపరిమళ-కలితుఁడనుట।
గంధవహుఁడయ్యెఁదొల్లిని-ర్గంధుఁడయ్యు॥ ౧౮॥

వ. మఱియు ననంతకల్యాణంబై భోగవతీపురంబును, ద్విజరాజమనోహరంబై హరజటాజూటంబును, శారదారామంబై సత్యలోకంబును, శైత్యకరంబై చంద్రమండలంబును, రాజకుమారాగ్రేసరంబై కైలాసంబును, సుధర్మాన్వితంబై నాకలోకంబును, బద్మానుకూలంబై కమలాకరంబును, కమలాకరంబై విష్ణువక్షస్థలంబునుంబోలి, పుణ్యజనసుప్రవేశంబయ్యును బుణ్యజనసుప్రవేశంబుగాక, అనవరతదానధారార్ద్రంబయ్యును ననవరతదానధారార్ద్రంబైయొప్పు నన్నగరీవరంబునందు. ౧౯॥

శా. ఆదిత్యత్రిచరిత్రుఁడైజనులక-ళ్యానందసంధాత్రుఁడై।
యాదిత్యప్రభువైభవోజ్జ్వలుఁడునై-యాదిత్యవంశోత్తరుం।
డైదిత్యాత్మజవారఘోరతరబా-హావీర్యుఁడైభూమిదే।
వాదిస్తుత్యవిలాసుఁడైదశరథ-క్ష్మాధీశుఁడేపారుచున్॥ ౨౦॥

సీ. ఇనగోత్రవరుఁడీతఁ-డనివచింపఁగ నేల,
ప్రబలప్రతాపవై-భవము తెలుపుఁ।
నగుపార్శ్వభౌముఁడీ-తఁడనియాడఁగ నేల,
దానకంకణసుహ-స్తంబ తెలుపుఁ।
దనరుమహాబలుం-డని చెప్పఁగా నేల,
హరికృతనిరతిస-ఖ్యంబ తెలుపు।
రాజశేఖరుఁడంచు-సహినుతింపఁగ నేల,
ద్విజరాజసుమనస-స్థితియ తెలుపు॥

గీ. నితఁడుకువలయహితుఁడని-యెన్న నేల।
డంబుమీఱుకరగ్రహ-ణంబ తెలుపు।
ననఁగ నొప్పెసఁగెఁ బలాయి-తాఖిలారి।
పఙ్క్తిరథుఁడగుచున్నయ-ప్పఙ్క్తిరథుఁడు॥ ౨౧॥

గీ. నిక్కముగ దస్యునిచయంబు-నుక్కడంచి।
నిక్కముగదస్యునిచయంబు-నక్కడంచు।
వేడ్క విబుధులపూజగా-వించిమతియు।
వేడ్క విబుధులఁ బూజగా-వించునతఁడు॥ ౨౨॥

క. క్షుద్రుఁడు లేఁడొకఁడైనన్।
క్షుద్రుఁడు లేఁడొక్కఁడైనఁ జూడంజూడన్।
క్షుద్రుఁడు లేఁడొకఁడైనన్।
భద్రంబుగ నాతఁడేలు-పట్టణమందున్॥ ౨౩॥

ఉ. ధారణిలోకమెల్లఁ బ్రము-దస్థితిఁ దన్గొనియాడ నీతిబా।
ధారహితత్వమొందియును-దప్పవువోయవివృష్టులెందునా।

ధారములేమిశత్రువసు-ధావయమానవతీక్ష్ణంబునం।
ధారలుగట్టియస్ద్రశర-ధక్షితినాయకు రాజ్యసంపదన్॥ ౨౪॥

క. ఎంతయు సంతసమున నమితి।
మంతులుగొనియాడ నంసు-మంతు ప్రభ సా।
మంతశిరోంతలతాంతని।
తాంతమహోజ్జ్వలలసత్ప-దాంతికుఁడగుచున్॥ ౨౫॥

చ. రమణవివాహమయ్యె శుచి-రప్రభఁ గోసలరాజకన్యన।
గ్రమహిషిఁ గా నరేంద్రుఁడు గ-రగ్రహణంబొనరించెఁ దాగ్రమ।
క్రమమున గేకయాత్మజన-గణ్యచరిత్ర సుమిత్ర నంబరా।
క్రమవిధివైయయ రాతులనఁ-గన్వనఁ గంబడకుండఁ గందగన్॥ ౨౬॥

వ. ఇట్లు కౌసల్యా కైకా సుమిత్రలం బాణిగ్రహణంబొనరించి. ౨౭॥

క. తద్దయు వేడుక మువ్వురు।
ముద్దియలం గూడి భోగ-ములు సల్పుచు నాం।
డెద్దియు నమరచియుండం।
బెద్దయుఁ గాలంబు చనెని-మిషమాత్రంబై॥ ౨౮॥

గీ. ఈతిరహితంబు గాఁగ నీ-రీతి సంత।
తక్షమాన్వితుఁడై నిర-తక్షమను।
పాలనంబున శత్రువి-ఫాలనమున।
నొప్పి నిస్వంతతిక్షితి గడు-నొప్పి గదుర॥ ౨౯॥

క. సంతానము పిత్రులకు।
సంతాదము గాన నాకు-సంతానము లే।
దెంతయుఁ బిత్రుదేవులకున్।
సంతోషము సేయలేని-జన్మంబేలా॥ 30॥

ఉ. దానములెన్ని యేనియును-ధర్మములుం దగునట్లు సల్పితిం।
దానము దంబులేమ విహి-తంబగు భోగములెన్ని యేనిసం।

తానసుఖంబువోలు నెఘనంబుగ సాకుఁదదాప్తవిప్రసం! ||
తానసమార్చనాంచితవి-ధానము చేసగుణంబు మెంచు మిక్ ॥ 30

కం. వెసనూహించిసుమంత్రి।
దిసుమంత్రులతో నపంధ-తీప్రియుఁడుసదా।
భ్యాసితామ్నాయుఁడునగున।
వ్వసిష్ఠుఁగురుఁజేరిమ్రొక్కి-వాంఛితమారన్ ॥ 32॥

కం హితుఁడవుఁదిగాక పురో।
హితుఁడవునంచద్దయాస-హితుఁడవు బాపా।
హితుఁడవుతిసుగుణగణము।
హితుఁడవునీకీడుగలరె-యెందుమునీంద్రా॥ 33॥

కం. మిత్రుఁడవగునీకరుణను।
పాత్రుఁడనైయుండిసుగ్ల-భస్థితినాకుం।
బుత్రరహితతిమిరవిహృతి।
చిత్రము సేయుంగదావ-సిష్ఠమునీంద్రా॥ 34॥

వ. అనిన నఖిల గుణగరిష్ఠుండును మునిశ్రేష్ఠుండునగు వసిష్ఠుండి ట్లనియె॥ 35।

ఉ. ఏధితకీర్తి నీకుఁదగు-నేయిటుదీనతఁగుందమత్తప।
స్సాధితశక్తిచేవిద్ర-సాధితసద్గుణభూషులన్మహా।
బాధితశత్రులస్సుతుల-భవ్యులఁగాంచిసుఖంతువింకని।
ర్వ్యాధితచిత్తవృత్తినొన-రింపుమభంగతురంగమేధమున్॥ 36॥

కం. అనిపలుకఁదనమనంబున।
జనియించినతోషి-దియు-సమమైనమనం।
బునఁబొంగుచు నెలమిందు।
జనసాయకుఁడశ్వమేధ-సవనోన్ముఖుఁడై॥ 37॥

మ పరఁగుంబారఁగ మంత్రులారవినుఁడీ-శాస్త్రప్రకారంబున।
న్సరయూపుణ్యనదీసమీపమునఁబ్ర జ్ఞావంతులైమీరుభా,

స్వైరయూపంబులునిల్పి కావలయుసం-భారంబులంగూర్చియా।
శరయూభాధికవిఘ్నమేమరకర-క్షాతత్పరత్వంబునన్॥ ౩౭॥

ఆ. మించియజ్ఞవాట-మంచితంబుగనొన।
రించియశ్వవరము-నెంచిసంభ్ర।
మించిసద్విధివిడి-పించిమానులబిలి।
పించియుండుఁడనిప-చించిన్నపుఁడు॥ ౩౮॥

ఉ. వేచని కాంచెఁ గాంచనని-వేశవినూత్నచిరత్నరత్నశో!
భాచయరోచమానమ్మదు-వస్త్రిఘుస్థగితేదకట్టిమాం।
తోచితసుస్థితిద్విపభి-దోద్యమదక్షసుశాస్త్రిహేతుధ।
ర్మాచరణైకయత్నలదు-రాత్మసపత్నులధర్మపత్నులన్॥ ౪౦॥

గీ. కాంచియిట్లనుఁబుత్రులఁ-గాంచుకొఱకు।
నిష్టియొనరింపఁదీక్షవ-హించివాఁడఁ।
గానమీరును వేడ్కదీ-క్షనువహింపుఁ।
ననినముదమందిదీక్షిత-లైరివారు। ౪౧॥

గీ. కాంతలునుఁదానునిట్టులే-కాంతదీక్ష।
సంతసంబునఁదాల్చివ-సంతమునకు।
నెదురునూమచునుండఁగ-ట్టెదురభూమి।
కాంతునకుసూతుఁడనియెనే-కాంతముగను॥ ౪౨॥

సీ. మహీనాథవినుమవ-గ్రహబాధముసురోమ,
పాదుదేశంబునఁ-బాదుకొనిః।
నయ్యంగపతిప్రజ-లయ్యంగఁగనుఁగొని,
హితమంత్రిజనపురో-హితులతోడ।
మనవిషయమునకే-మననిట్టిదురవస్థ,
బాటిల్లదినినె-ప్పాటఁబాపి।
కొనవచ్చుఁజెప్పరే-గొనకొనిమీరిప్పు,
డనవుడువేగన-య్యానఘుమతులు।

గీ. దమమనంబులనీతిశా-ధానిరాస।
కంబు సేయుంగ జాలుమా-ర్గంబుఁ జాలఁ।
బోలనూహించియమ్మహీ-పాలవర్యుఁ।
డెంతయును సంతసింపఁగా-నిట్టులనిరి॥ ౪౩॥

క. కశ్యపపౌత్రుఁడుకవసా।
దృశ్యుండువిభాండకాత్మ-దేహభవుండై।
వశ్యేంద్రియనిచయుండై।
ఋశ్యశృంగుండునాము-నీంద్రుఁడు వెలయున్॥ ౪౪॥

క. వనపూర్ణమహాతేజుఁడు।
వినుసన్మార్గప్రచారి-విమలాత్ముండుం।
ఘనుఁడఖిలభూతహితుఁడా।
తనినిటరప్పింపుము విబు-ధస్తుత వేడ్కన్॥ ౪౫॥

క. అతఁడిటకేగుదెంచిన।
నాతతవర్షములుఁ గురియు-నన వుడు వారిం।
బ్రీతింగనుఁగొనియాతని।
వేతేదత్కులబలలని-వినినకతమునన్॥ ౪౬॥

క. భూవరుఁడు బిలువనంపినఁ।
గైవారము సేయుచుసము-ఖమునకుఁగన్నా।
కైవారస్త్రీవారము।
రావారలఁజూచియంగ-రాజిట్లనియెన్॥ ౪౭॥

చ. అనఘుఁడు ఋశ్యశృంగుఁడును-హాముని ఘోరతపంబు సేయుచు।
న్వనమున నున్న వాఁడతఁడు-వారులతాంగులు వీరుపూరుషు।
ల్వనమిది పట్టణంబిదిధ్రు-వంబుగనంచు నెఱుంగఁడమ్మహా।
త్ముని విటఁదోడితేవలయు-మోద మెలర్పఁగ మీరు నావుడున్॥ ౪౮॥

సీ. ముఖపంకజామోద-మునకుమూఁగుచునున్న,
భ్రమరకంబులుభ్రమ-రకములనఁగ।

వడఁగాంచియుం ఘుప్రిల-వడిఁ జెనంగొను హంస,
కములు విస్ఫుట హంస-కములనంగ।
శుకచంచుపుటనిక్ష-త్తకమహీపతితప,
ల్లవములు జారుప-ల్లవములనఁగ।
నటనశ్రమోద్భూత-పటుఘర్మబిందువి,
సరములు ముత్తెంపు సరములనఁగ।

గీ. జిమ్మి పట్టెదు నెడఁ బైటఁ-జిక్కుపూల।
చెండ్లు సిబ్బెపుగుబ్బపా-లిండ్లనంగ।
నిట్లు సేయ నిశృంగార-మింపు సేయు।
మునివృషభుఁ జేరఁ సురభులై-ముదితలపుడు॥ ౪౯॥

గీ. దంతకుట్మలములుఁ బృథు-స్తనగుళుచ్ఛ।
ములుఁ జిగురుఁ బల్లవంబులుఁ-బొలుపు మీఱ।
సితనఖకుసుమంబులును బాహు-లతలుఁ దెలుఁగ।
గొమ్మలనఁ బొప్పె నడిచిర-కొమ్మలపుడు॥ ౫౦॥

మ. పులినశ్రోణులుఁ జక్రవాకకుచలు-త్ఫుల్లాబ్జపత్త్రాస్యలు।
త్పలగంధుల్వరకంబుకంఠలులస-త్పాకీదృగ్జాలలై।
రొలమింగశ్యపపాత్రుఁడుత్తమతపం-బేవేళఁ గావింపను।
జ్జ్వలమానవ్వనరాశికిన్నదులనా జంజేరిర శ్యామినుల్॥ ౫౧॥

శా. కీరంబుల్వెలరేఁగి కూయమునిసాం-కేతంబు మంటూర్చివి।
స్తారోదారకుచోల్లసత్ప్రచమహా-ద్భారావతస్వాంగలై।
యూరంబుల్వడిఁ దూఱి దాను మమ్మాగా హీనధ్వనుల్వింపుశృం।
గారంబొప్పవరాభిసారికలనం-గా నేగిరచ్చెంతకున్॥ ౫౨॥

క. శృంగారవతులు వేడుక।
సంగీతరవంబు సెలఁగ-జని కాంచిరి వి।
స్సంగున్ భూతియుతాంగున్।
శృంగారానంగుబుధశ్య-శృంగునవధంగున్॥ ౫౩॥

వలసి వచ్చిన ట్టి-ఘన దేవతలనంగ।
బలిసి భూషణ ప్రభ-లలి వెలుంగ॥ ౫౮

చ. కుచములు రంభనంగ దివ్య-గుమ్మిక పుంగిటఁ జేర్చి హాహా।
శచయమువోని వేణులభ్ర-శంబునఁ జుట్టుచుఁ గల్ల వోల్లస-
ప్రచిరుచి రాధరంబుగ రతో యజముల్ద సాఁచి ముట్టుచు।
న్విచలిత ధైర్యుఁ జేసిరర-విందనిభాననలిక్రమంబునన్॥ ౫౯

వ. అంతం దమయందు బద్ధానురాగుండగుట యుపలక్షించి యచ్చం చలాక్షులు మబ్బుంజొచ్చు మించుబంబోలె వంచనం దొలంగించి చనుటయు. ౬౦

ఉ. ఎప్పుడు వత్తురో యనుచు-నెంతయు వారలు సన్నమార్గముం
దప్పని చూట్కిఁ జూచుటిడి-తప్పనియోంచక యగ్నికార్యముం
దప్పని యమ్మహోత్సుఁ డుము-దంబునఁ దద్గుణకీర్తనంబులం
దప్పని తఃపరంబు మదిఁ-దార్పకయుం డెసనంభ్రమంబునన్॥ ౬౧

క. ఆత్మభవసదృశుఁ డమ్ముని
యాత్మభవవికారరహితుఁ-డయ్యుండెయుఁ దా
నాత్మభవార్తిపభాండము
నాత్మభవుఁడు పన్ని విచలి-తాత్ముండగుటన్॥ ౬౨

క. మరు నాఁగు చెలఁగు మనుకే
మరు నాడు చుమానిక దకు-మ రుచలుత్వరతో
నరు దెంచిరి యరుదెం మటు
యరుదెంచుట విమలఖరక-రాన్వయముఖ్యా॥ ౬౩

వ. ఇట్లు వచ్చుటయు. ౬౪

క. విధిగన్న పేదవోలెం
బుధమతుఁ డన్నియమివారిఁ-జౌడ గాంచియుఁ
ద్బుధ తేజుఁ డిట్టులమఁదు
ద్గ్రిధితమనోగ్రంథియగుచు-దైన్యముదోఁపన్॥ ౬౫

చ. ననువిడ నాడ న్యాయమగు-నామితునమ్మిక వాఁడనంచుఁ బ।
లి్క-ననఁగఁ గాక రమ్మను మ-రేమలు కల్కి-నుబంజరంబుఁ జే।
ర్చినక్రియనమ్మహామహుఁ బ-సిద్ధగుణాస్పదరోమపాదకుం।
భినపతిపట్టణోత్తమస-మీపఘనోపవనోపకంఠమున్॥ ౧౬॥

క. హర్షముగఁ జేర్చినత్య।
త్క్రర్షముగా నెల్లమొదలఁ-గరశాయుతమై।
వర్షంబుదేవతాసుమ।
వర్షములో నెఃసికురిసె వసుమతియలరన్॥ ౧౭॥

ఆ. అంతరోమపాదుఁ-డాప్తమంత్రిపురోహి।
తాదిసుజనసహితుఁ-డగుచుభక్తి।
నెదురుసనివిధిసువి-హితపూజలొసరించి।
వేడుకలరఁ బురికిఁ-దోడితెచ్చి॥ ౧౮॥

ఆ. సంతసమునవిప్ర-సంతర్పణమొనర్చి।
పరిపురమునమత్స-వంబుచాటి।
వారముఖ్యలకున-పారవిభూషణాం।
బరములొసఁగివినయ-భరితుఁడగుచు॥ ౧౯॥

క. మునిపతికిఁ బెండ్లిసేసెం।
దనరఁగ సద్గుణనితాంతఁ-దనసుతశాంతం।
దనుగంధజితలతాంతం।
జనపవహాభినుతమహిత-శాంతస్వాంతన్॥ ౨౦॥

వ ఇట్లుపరిణయమహోత్సవంబు నిర్వర్తించి జామాతందన యింటను నిచికొని యనావృష్ట్యాది భయంబులు నిజరాష్ట్రంబునకుం గాక యుండ రోమపాదుండు సంతోషితుండై యుండెనని చెప్పి సూతుండు వెండియు. ౨౧॥

ఉ స్పష్టగుణాకరుండగువ-సిష్ఠుఁడుతోనయడేర నెంతయుం।
తేటముగాఁగఁ బొందునవ-రిష్యయుతో నిధిబుశశాంగుబం।

హస్తముగా నుతించిరిఁగ-నిక్కడకుం దొడితెచ్చి హెచ్చుసా
ధస్తముగాఁగఁ దద్దశవి-ధిం దనయేష్టి యొనర్చి చెచ్చెరన్॥ ౨౨॥

క. ఆత్మజాతుల నలువుర-నతులబలుల
నిర్జితారాతులం గని-యూర్జితుఁగ
నలరెదవని సనత్సు-జాతాగ్రజాతుఁ
డనియెనని చెప్పుటయుగశ-స్యందనుండు॥ ౨౩॥

గీ. సూతువాక్యామృతము దన-శ్రుతిపుటములఁ
దనివిసనక నరేంద్రుఁ డెం-తయును గ్రోలి
హృదయకుహరంబు నిండి పై-కెగయుచున్న
వరసుధాధారలనఁ బాష్ప-ఝరిఁ దనర్చు॥ ౨౪॥

సీ. హితమంత్రిజనపురో-హితసహితంబు గాఁ
బటుతరోద్భట వీర-భటులు గొలువ
మంగళరవము సె-లంగ మత్తుంగతు,
రంగతరంగమ-తంగజాంగ
మకరపికరభీక-రకరాసిదర్వీక,
రసుఖేటక మతవి-భ్రాజితంబు
రైన వాహినులు ద-న్ననుసరింపర సాధి,
నాథుండు సంగీత-నాదములన

గీ. గణ్యపుణ్యాగ్రజన్మాగ్ర-గణ్యవిహిత
సాదరాశీర్ని నాదము-మేదురముగ
రోమపాదధరాధీశ్వ-రుని పురంబుఁ
జేరనయ్యంగపతి సవి-శేషభక్తి॥ ౨౫॥

క. మన్నించి మీరు వచ్చుట
మన్నలము పూజ్యులయ్యె-మహనీయగుణా
ధన్యుని న్నాఁడఁ గంటిఁగ
దున్నిర్మలమై తనర్చె-మున్మది నాకున్॥ ౨౬॥

కం. ఆగమచోదితధర్మవ।
రాగమయూలామకూల-యతిధైర్యసువ।
న్నాగమనోమోదముభవ।
దాగమవనంబునకుమూల-మదియెయ్యదిరో॥ ౨౨॥

కం. ఆనతియిండా కార్యము।
నానతరిపులోకదశర-థాధీశ్వరసు।
స్నానముతో నోషఁగూర్తు।
స్నానక యదిగొంతయఘట-మానంబైనన్॥ ౨౩॥

కం. నావుడుసత్యవ్రతవిభు।
మీవంటిటివాఁడవగుట యే నెఱిఁగియునా।
దేవచ్ఛిలివినిపించెద।
నావచ్చినకార్యసరణి-నరసుతచరితా॥ ౨౪॥

ఉ. భీత్యణచావపావకుఁడు-వేదవిధిజ్ఞుఁడుసాధితేదవి।
ద్యాత్మ్యటిరాజవంజవుఁడ-హంకృతిదూరుఁడునిర్మలాత్ముఁడున్।
ధాత్రినిభుండుగశ్యపవి-ధాత్రసుతాత్మభవుండునీకుజా।
మాత్రుఁడుబుశ్యశృంగుఁడస-మానుఁడుమానవవంశదీపకా॥ ౨౫॥

కం. ఆతనిఁగొనిపోవుటకై।
యేతెంచితినమ్మహాత్ము-నెలమిందారా।
నీవ్రతునిఁగాఁమత్పురమున।
ఖ్యాతగుణసముపుమిదిప్రి-యంబగునాకున్॥ ౨౬॥

చ. అనవుఁడుసంతసించితన-యల్లునిఁగన్గొనిభక్తిఁదద్విధం।
బునడిచియాతఁడియ్యకొన-భూవరుఁడెంతయుసన్నుతింపన।
య్యనఘునిబుశ్యశృంగునిని-రంతరవర్షసమర్థభూమిపం।
కవిరసనార్థమంపెనన-గానగఁడంపెజగద్ధితంబుగన్॥ ౨౭॥

వ. ఇట్లుపంపుటయు. ౨౮॥

క. శాంతాత్మఋష్యశృంగుని।
శాంతాసహితముగఁ దెచ్చి-జననాయకుఁడా।
శాంతాపూరితయశుఁడని।
శాంతముసార్థంచెసకల జనములు వొగడన్॥ ౮౪॥

గీ. శాంతనంతఃపురమునఁ దగ-నంతసమున।
ననుపమమ్మునిపత్నిక-య్యధిపపత్ని।
లెదుకుసనిమెప్పిరి-యయ్యామ-కీర్తి మెసఁగ।
భక్తిసేయంగమందెన-ప్పరమసాధ్వి॥ ౮౫॥

వ. దశరథుండును ఋష్యశృంగసందర్శన సంభాషణంబుల సంభావితుండైయుండె॥ ౮౬॥

ఉ. చాలముదంబుసేసెనువి-శాలరసాలకసాలబాలపై।
కాలమువల్లరీస్థమధు-పాళిభరానమితోల్లసల్లతా।
జాలము సౌఖ్యమూలమును-సౌరభసంయుత మందమందవా।
తూలము భ్రాంతకూలమును-త్ఫుల్లసుమాధవకాలమంతటన్॥ ౮౭॥

సీ. మాధవురాకకు-మానితామోదయై,
నవపవలక్ష్మిజీ-ర్ణచ్ఛదములు।
తగవనినూత్నచ్ఛ-దములలోఁ బిఫరియించి,
హస్తముల్సాఁచిర-మ్మనుచుఁ బిల్చె।
చున్నదోయనసుగం-ధోద్భాసియైయుండు,
టాశ భూడిచితలి-రాకు లెలమిఁ।
దనరఁబికాళిబృం-దంబులందందవా,
నందంబువొందిధ్వా-నములుసేయ।

గీ. సౌవరమణియునుఁదట్సంగ-ఘనసుఖమునఁ।
సౌదవుబుబ్బులచాలునా-నొప్పమిగుల।
నములనిజరుచిదిజితనీ-హారకేదగ।
తారకములగునభినవ-కోరకములు॥ ౮౮॥

ఉ. మేధ్యముగాఁగనన్ను హయ-మేధ మొనర్పఁగఁబంచితాత్రవా।
సాధ్యులసంతతప్రణుత-సాధ్యులఁబుత్త్రులనిద్దసద్గుణా।
రాధ్యులగాం మనల్లుగ వ-రంబుఁగరంబునొసంగుమంచుసా।
న్నిధ్యమునందు వేఁడుధర-ణీపతిఁగాంచివసిష్ఠుఁడాదృతిన్॥ ౯౭॥

క, కాకుత్థ్సాన్వయదీపక।
నీకింతవిచారమేల-నేఁగలుఁగఁగను।
శ్లోకులఁబుత్త్రులఁబడసెదు।
ప్రాకటసరయూనదీవ-రతటంబునకున్॥ ౯౮॥

క. వినునీవునీదుభార్యల।
జననాయకమంత్రిపౌర-జానపదులస।
జ్జనులమునులవిప్రులఁదో।
డ్కొ-నిచనుమేఋశ్యశృంగుఁ-గొనియేతెంతున్॥ ౯౯॥

వ. అని పల్కుటయు. ౧౦౦॥

గీ. రహిశిలీముఖచక్రవి-భ్రాజితంబు।
నైసమర్యాదగుల్మస-మావృతంబు।
నైహరిస్ఫురితంబునై-యలరుచుండి।
నసరయూవాహినిం జేరి-నరవిభుండు. ౧౦౧॥

వ. విబుధపరివృతుండై మహేంద్రవిభవంబున విశిష్టగుణగరిష్ఠుండగు వసిష్ఠుండును, మంగళగుణానుషంగుండగు ఋశ్యశృంగుండును, హృష్టులగు మహర్షులును, దపోనూనులగు మానులును, మహానుభావులగు మహీదేవులును, సర్వజ్ఞులగు దైవజ్ఞులును, సారులగు పౌరులును, జ్ఞానవిదులగు జానపదులును, నిర్వర్తితరాజ్యతంత్రులగు సుమంత్రాదిమంత్రులును, కాంతలగు బుణ్యకాంతలును, సువ్రతైకయత్నలగు ధర్మపత్నులును, వినయనిధులగు వందిమాగధులును, శృంగారాధారలగు వారనారులుందోడరా ననురూపరూపయూపప్రపాసుందరంబును, స్పష్టాష్టపదేష్టికావిరచితవేదికా

కుండమండితంబును, ప్రసిద్ధక్రతూత్సవాలోకనాగత చాతుర్వర్ణ్య
తత్తదుచితనికాయ్య నికాయ కాయమాన సమావృతంబును, కుం
భామనోహరంబును, ధనధాన్యశాలి తండులఘృత తైలగుడసూప
శాక తృణకాష్ఠజలప్రభృతివస్తు ప్రశస్తంబును, విమలసరయూక
మలానుకూల కూల లతాపాలవాల సూన సుగంధవహ గంధవా
హ సుప్రవేశంబును, దక్షిణానీత ఘనాపీననైచికీమణీగణసంభ
రితంబును నై విచిత్రంబులగు ధవిత్రంబులును, పవిత్రంబులగు సు
వర్ణపాత్రంబులును, నవంబులగు స్రుక్స్రువంబులును, మంజులో
ల్బణ రత్నకంబళపుంజంబులును, మఱియుం దక్కునవివిధోపకర
ణంబులునుం గలిగియొప్పు నభినవ సవన భవనంబుఁ బ్రవేశించి ధ
ర్మపత్నీసహితుండై॥ ౧౦౨॥

గీ. శుభముహూర్తంబునను వసి-ష్ఠుఁడును బుశ్య
శృంగుఁడును మునివరులును-సెలవొసంగ
నగ్నిముఖులగ్నిముఖమున-నలరనవ్వ
డగ్నిముఖమొనరించెఁ గ్ర-త్వాదియందు॥ ౧౦౩॥

వ. తదనంతరంబున. ౧౦౪॥

శా. స్వాధ్యాయావర్తితజాత వేదహితమ-ధ్యప్రస్థితాపూతసా
న్నాయ్యప్రాహుతినిర్గమత్ప్రబలనా-నావర్ణధూమాభ్రసా
హాయ్యంబొప్పశతక్రతుండుగ్రతుభా-గార్థంబు రాదక్షిణా
వాయవ్యద్వ్యగ్నులయాగ్నిహోత్రములుఛం-దజ్ఞుల్ప్రవర్గ్యాదులన్॥

గీ. సముచితంబుగ వేల్వన-శ్వముఖలసదు
పాకృతశమన మొప్పవ-పాప్రహోమ
విధులవిందార్హులైనది-విజవరులకుఁ
దృప్తియొనరించె నజ్జగ-తీవిభుండు॥ ౧౦౬॥

సీ. ఈక్రమంబునను స-ర్వక్రియాసంపూర్ణ,
మైవివిధాన్నపా-నాదితర్పి

తాఖిలలోకమై-యనవద్యదక్షిణా,
భూమమైవృతవపా-ధూమమైవ।
రంబయివిఘ్నదూ-గంబయిఖచరభా,
వ్యంబయిద్విషదస-హ్యంబునైస।
భాసదాహ్లాదమై-బహుళసంస్తావపూ,
తంబయిపాపకా-దంబినీప్ర।

గీ. భంజనంబయి వాద్యసం-భరితమైధ।
రామరాశీర్ని నాదవీణానుకూల।
నాదపుణ్యాంగనాగాన-నాదఘూర్ణ।
మానమైయశ్వమేధమ-నూనమయిన॥ ౧౦౮॥

చ. పుడమివిభుండుఁ దాపసవి-భుండువిభాండకునాత్మజున్నతిం।
పుడమితహర్షుఁడైకరుణఁ-బుత్రకకామవరేష్టి సేయన।
ప్పుడమితభాషితిన్మునిప్ర-భూతహితాహుతులొప్పవేల్చెన।
ప్పుడమిజనంబులెల్లఁగడుఁ-బొంగికనుంగొనుచుండసద్విధిన్॥

మంగళమహాశ్రీవృత్తము.

ఆసమయమందుగమ-లాసనునిగ న్గొనఁగ-వాసవపురస్సరముగాసం
తాపసులగుమంద్రిదివ-వాసులొగిడాసినుతి-చేసినదయామ
యుఁడునావా।
ణీసతినిఁగూడిదర-హాసముముఖంబునవి-కాసమమరన్సురలతోను।
ల్లాసమొదవంగరుణజేసిపలుకున్వెతలబాసిముదమందుచువినంగన్

క. ఈకడకుమీరువచ్చిన।
యీకార్యముఁదీర్పఁదక్షుఁ-డీక్షితినరయ।
నైవ్యకుంఠపురాధీశుఁడు।
వైకుంఠుఁడుగాకయొరులు-వలతురెయనుచున్॥ ౧౧౦॥

గీ. వారిఁదోడ్కొనియప్పుడ-వారితముగ।
వారిజభవుండుపూర్వదే-వారియుండు।

వారినిధిగాంచియచటదేవారిహతుస।
వారిహితుఁగాంచిపొగడెన-వారిగాఁగ॥ ౧౧౧॥

సీ. అమృతసంకర్ష-ణాదినామోత్కర్ష,
పాలితామృతతర్ష-పరమహర్ష।
భక్తనేత్రోద్ఘర్ష-బహుసద్గుణాకర్ష,
యమితప్రకర్షస-హస్రశీర్ష।
సుజననిరామర్ష-కుజనధురాధర్ష,
దానవసామర్ష-మానితార్ష।
వరకృపామృతవర్ష-వాహనవిహగర్ష,
భఘునాథుమర్షసం-భరితవర్ష।
గీ. యాజిఘర్షితరిపుశీర్ష-కామకర్ష।
సంతతానందయోగిస-త్సన్నికర్ష।
కరుణమామొఱవినిపొమ్ము-పరమపురుష।
యధికతరదుఃఖరాశిస-మాపకర్ష॥ ౧౧౨॥

క. లోకంబులుగలిగింపను।
లోకంబులమనుపసర్వ-లోకంబులువే।
శోకార్ణవంబునేయఁగ।
నీకచనుంగమలనాభ-నిరుపమశోభా॥ ౧౧౩॥

క. లోకాధారుండవఖిల।
లోకాతీతుండవార్య-లోకహితదయా।
లోకుండవునసమానా।
లోకుండవుసోమలోక-లోచననేత్రా॥ ౧౧౪

క. అభవుఁడవయ్యుండియుదు।
ష్టభయంకరరాక్షసప్ర-శమనంబునకై।
ప్రభవించెదవాకొకతతి।
శుభచరితులయిండ్లభక్త-సులభుఁడవగుటన్॥ ౧౧౫॥

చ. అనఘుత్వదీయదర్శకుల-యత్వవిహీనతళస్థ్రలైభయుం।
దునువిజయుండులోకముగ-దుంభయమ్మందగ దైత్యులెజనిం।
చినువరాహరూపమునఁ-జెన్నువహించిహిరణ్యనేత్రునిం।
దునిమిన్రసింహవిస్ఫురణ-గ్రుంచితివగ్రజుహేమకశ్యపుఁ॥

క. ఆదనుజాధములఖిలన।
రాదులుఘుటకర్ణరావ-ణాహ్వయములచే।
మేదినిజనించిదిశ్వా।
లాదులభర్జింపుచుండి-రతిబలులగుటఁ॥ ౧౧౬॥

సీ. నిమిషసుస్థితిలేదు-నిర్జరవరులకు,
వఖిలదిక్పతులుని-రాశులైరి।
పాతాళమునకునై-పాటిరిభుజగులు,
గిన్నరుల్గుహలదా-గిరిభయమున।
గ్రహములునిర్వక్ర-గతిఁదనర్చుటలేదు,
సాధ్యులకధికవి-చారమయ్యె।
బ్రాహ్మణోత్తములకు-రాగహీనతఘన,
తరులకాఘులపాటు-పరిథవిల్లె।

గీ. వరమఖంబులుగదుదుర్ల-భంబులయ్యె।
మునులగర్వసమృద్ధిని-ర్మూలమయ్యె।
ఖచరకాంతాక్రమణమహో-త్కంఠుఁడైన।
పక్తికంఠుఁడుసేయునుప-ద్రవమున॥ ౧౧౭॥

క. హేమనఁగళరాసమునగ।
మేమనఁగలదతఁడులీల-నెత్తినచోనిం।
కేమనఁగనెంతనిలిచెద।
మేమనఁగలమేసురారి-మీఁదికిఁజనిన॥ ౧౧౮॥

క. రావణుసమస్తలోకవి।
రావణుఁబరిమార్చిచెచ్చె-రందదనుజానిం।

గావరమారించిమమ్ముం।
గావరమాధీశ నీవ-కలవనియుటకున్॥ ౧౨౦॥

వ. చను దెంచిన వారమని పలికి వెండియు॥ ౧౨౧॥

క. భవదారితనామఘనో।
భవదాహక మిత్రహితవి-భవదాయకధీ।
భవదాలోకముగుంఠీ।
భవదాశరలోకమగున-భవదాంతనుతా॥ ౧౨౨॥

క. అసకమలాసనముఖ్యులు।
వినుతింపఁగ సంతసించి-విశ్వముతోఁడుచ।
య్యవఁబ్రత్యంతఘుంబయ్యె।
న్నవలోవఁడుఁ డెప్పుడుఁ భక్త-వత్సలుఁడుగదా॥ ౧౨౩॥

సీ. కాదంబినీసమూ-ద్గమములై చంచల,
త్వంబునొందనిచంచ-లంబులొక్కొ।
శ్వేతషోడశకళా-శృంగారయుగపత్ప్ర,
దీప్యత్సహస్రేందు-దీప్తులొక్కొ।
యవనీభరవహశే-షాద్యశేషవిశేష,
ఫణిఫణామణిఘృణి-ప్రచయమొక్కొ।
యత్యయద్వాదశా-దిత్యసంస్తుత్యఘు,
నాత్యంతిరుచిరతీ-వ్రాంశులొక్కొ।

గీ. యనఁగ జాడ్క్రుఱమిఱుమిట్లు-గొనఁగఁ జల్లఁ।
దనము మీఱఁగ నధికచి-త్రంబుగాన।
సహానదుస్సహముగనొప్పు-మహితదేహ।
కాంతులెల్లెడఁ బర్వహా-హాకరింప॥ ౧౨౪॥

క. చతురాననుండు నిజఘన।
చతురాననములనువిష్ణు-జనవరిష్ణుం।

జతురాగమములఁ బొగడెను।
జతురతయొప్పంగ సంత-సమునిండారన్॥ ౧౨౫॥

గీ. అపుడు తద్దివ్యమూర్తి తే-జోనలోక।
నంబు సేయఁగ నధికము-దంబు గదుర।
నలశతక్రతుఁడురుసహ-స్రాక్షుఁడయ్యె।
నమరవరులెల్లననిమిషు-లైరి మీఱి॥ ౧౨౬॥

సీ. అశ్వమేధశతఫ-లావాప్తి గోత్రభే,
దికి సర్వభక్షకు-నకు శుచిత్వ।
మురుదండధరునకుఁ-గురుధర్మదేవత్వ,
మల రాక్షసునకుఁ బు-ణ్యజనఘనత।
జడపతికిఁ బ్రచేత-సత్వంబు లోకప్ర,
భంజనునకు జగ-త్ప్రాణమహిమ।
వరవాహనునకు ధ-నదమహాభిఖ్యయు,
సర్వజ్ఞతసుధర్మ-శాస్త్రవునకుఁ।

గీ. దనదు తేజోమయాత్మద-ర్శనము కతనఁ।
గలుఁగఁ జేయుచు నందఱఁ-గలయఁ జూచి।
మేఘగంభీరములును న-మోఘములును,
మధురములు నైన వాక్కు-ల మధుహరుండు॥ ౧౨౭॥

ఉ. భానుకులాగ్రగణ్యుఁడగు-పఙ్క్తి-రథాత్మసతీత్రయంబునం।
దేనుజతుర్వరాకృతుల-నెంతయు వేడ్క-జనించి రావణు।
న్మానమదాతిరేకములు-మాన్చి యమాత్యసహోదరాప్తసం।
తానము మున్నుగా యమప-దంబునకంపెదఁ జింతయేటికిన్ ౧౨౮॥

క. మీవలని యనుగ్రహమున।
మీవలనికి వచ్చితినిట-మీఁద నరుఁడనై।
మీవలపినటుల మెలఁగెద।
రావణుమాత్రములు మీకు-రావణుబాధల్॥ ౧౨౯॥

ఆ. అజానివరములడుగు-నప్పుడునరవాన।
రాలిఁజావకుండ-నడుగఁడతఁడు।
కాన నేనుమర్త్య-యోనిజనించెదఁ।
బుడమిఁబ్లవగులగుచుఁ-బుట్టుఁడీరు॥ ౧౩౦॥

వ. అనియానతియొసంగి. ౧౩౧॥

క. లోహితనిధిశయనుఁడుపటు।
లోహితకరమహితదీప్తి-రుచిరుఁడుసురపా।
లోహితకోటిధిషణుఁడా।
లోహితఖగనాథుఁడైతి-లోహితుఁడైనన్॥ ౧౩౨॥

క. వనజజుఁడుజాంబవంతుని।
సునయులుహరిహయులువాలి-సుగ్రీవులన।
శ్వినులలమైందద్వివిదుల।
ఘనభల్లుకకీశపతులఁ-గలిగించిరొగిన్॥ ౧౩౩॥

క. అనలాత్మునవనిశమనవం।
జనయమసాధ్వీమతల్లి-సద్గర్భపరో।
బ్జినిఁదగఁగపికులచంద్రుఁడు।
హనుమంతుండుదయమయ్యె-హరిదయమటియున్॥ ౧౩౪॥

క. తమతమయంశంబులను।
త్రిపుత్రములవలీముఖులను-దఱుచుగసురస।
త్తములిలఁగలిగించిరిచి।
త్తములానందింపదైత్య-దర్పచ్యుతులన్॥ ౧౩౫॥

వ. ఇట్లుగలిగించిన దేవాంశసంభూతులగు నాప్లవంగపుంగవులు.

ఉ. కొందఱునీలునిన్నలుని-గొందఱుగొందఱుమిత్రసంభవుం।
గొందఱుగంధమాదనుని-గొందఱుమైందునిగొందఱంగదుం।
గొందఱుగేసరింగజుని-గొందఱుఁగొందఱువాయుపుత్త్రినీ।
యందఱునింద్రనందనున-హర్నిశముంగొలువందనర్చుచున్॥౧౩౬॥

ఆ. పర్వతంబులెత్తి-బంతులాడుచుఁ గొంద
ఱిలలనుగ్గుగాఁగ-జేఁజఱచుచు
ధరణి గ్రక్కదలఁగ-దాఁటుచునుండిరి
ఋశ్యమూకముఖగి-రీంద్రములను॥ ౧౩౮॥

క. అంతకమున్న క్కడ సుర
లెంతయు సంతసిలఁ దశర-థేశ్వరుఁ డఖిలా
శాంతవ్యాపితధూమా
త్యంతమనోహరసుతేష్టి-యమరించు నెడన్॥ ౧౩౯॥

తే. యజ్ఞకుండాంబునిధిఁ బుగ్య-జాంగమాధ
వానుశాసనమున విబు-ధాధిపుండు
మంత్రమంథనగంబుచే-మథనవిధియొ
నర్ప నమృతంబు దెచ్చుధ-న్వంతరియన॥ ౧౪౦॥

ఉ. ఆయతయజ్ఞకుండమహి-తాంతరమున్ వెసనిర్గమించెనో
భాయుతదివ్యమూర్తి రఘు-వంశసుదీపకుమారసంభవో
పాయసపాయసుండయి నృ-పాలకృతాహుతిసద్విధానవి
స్ఫాయదనుగ్రహంబున వి-భావసుఁ డాత్తనిజస్వరూపుఁడై॥ ౧౪౧॥

క. ఆక్షణమునఁ దనకుం బ్ర
త్యక్షంబయ్యెనదివ్యుఁ-డగు నొకపురుషుం
డక్షీణప్రభ నొప్పఁ బ్ర
దక్షిణమొనరించె విభుఁడు-దయితాయుతుఁడై॥ ౧౪౨॥

వ. ఇట్లు. ౧౪౩॥

చ. తనకుఁ బ్రదక్షిణించియుచి-తంబగుభక్తి నమస్కరించియు
న్నవరవరేణ్యుఁ గాంచి మహి-నాథ తనూజులు నీకు నల్వుర
త్యనుపమమూర్తు లిద్ధబలు-లర్కకులాగ్రణు లుద్భవింతురీ
ఘనతరపాయసంబుఁ గుల-కాంతలకున్ వెస పంచనిచ్చినన్॥ ౧౪౪॥

క. అనిచెప్పిమనోరథసి।
దినొసంగినభంగినపుడు-దివ్యపురుషుఁడో।
య్యనఁదత్పాయసపాత్రం।
దినకరగోత్రునకొసఁగియ-దృశ్యుండయ్యెన్॥ ౧౪౫॥

క. పరమాత్సర్యయుతమహీ।
పరమాకర్ణనపరుండుఁ-బఙ్క్తి-రథుఁడుఁ దా।
త్వరమాన్న పాత్రఁజేకొని।
పరమాహ్లాదమునఁబుడు-బట్టణమునకున్॥ ౧౪౬॥

సీ. చనుదెంచియప్పాయ-సము రెండునంశము,
లొనరించియొక్క-భా-గంబుఁబెద్ద।
భార్యకు రెండవ-భాగంబు రెండవ,
భార్యకొసంగిభూ-భర్తపిదపఁ।
కౌసల్యపాలిస-గంబునుగైకభా,
గంబునసగమురా-గంబుమీఱఁ।
దెచ్చిసుమిత్రకం-దిచ్చిభాగములునా,
ల్గింటిలో రెండుగ్రా-ల్గంటిచిన్న।

ఆ. భార్యకయ్యెఁగడమ-భాగద్వయంబుభా।
ర్యాద్వయమునకయ్యె-నధికమైన।
ప్రేమపతికిఁజిన్న-పెండ్లామునందును।
దల్లికిఁగడగొట్టు-తనయునందు॥ ౧౪౭॥

మ. పరమాన్నానుభవంబునన్సతులకున్-భావింపఁగావ్యదిఁగాం।
చెరహింగోరు-లునాస్య పాండిమములున్-శృంగారవక్షోజభూ।
ధరముల్జిట్టుములావులింతలణుమ-ధ్యంబుల్మదంబుల్వికే।
పరుచుల్మన్నగమందమయ్యెనవలు-న్సద్భూషణాపేక్షలున్॥

క. కటికుచకచభారలకుం।
బటుతరముగఁబున్నగర్భ-భారంబులలో।

స్ఫుటభాగమరుచిరమహో
త్కటరత్నాభరణగణము-గడుభరమయ్యెన్॥ ౧౪౯॥

గీ. అధికమధుపానమత్త-నబ్జవాంఛ
భ్రమరకంబులు జక్రవా-కములమీఁద
వ్రాలెనసఁ గాంతలకులిప్త-వరకుచాగ్ర
నీలిమదనర్చనత్తొలి-చూలువేళ॥ ౧౫౦॥

సీ. ప్రియపుత్త్రిదర్శన-స్పృహమించె నృపతికిఁ,
గంబుకంఠులకు శ్ర-మంబు మించె
నానికుతుకంబు-మీఱె నరేంద్రున,
కంబుజాస్యలకునా-గాసుమీఱెఁ
బటుతరంబుగ మేను పొటకరించె మహీవి,
భుజకంగనలవళు ల్పొటకరించెఁ
దెలివ్వామొలకలె-త్తెనిలాపతికిఁ జంద్ర,
ముఖులకుఁ దెలిడాలు-మొలకలెత్తె

గీ. మానిసత్త్మవిధితకు-మారకామ
సప్తతంతుప్రభవపుఘ-షప్రవరస
మాత్తమాధుర్యపాయసా-హారకలనఁ
బ్రాకటంబగుదౌహృద-శ్రీకతమున॥ ౧౫౧॥

ఆ. సకలజనులకుఁ బరమహ-ర్షంబునిండ
దేవతాస్తుతిరవముల-దివమునిండఁ
గలితజీవితకాలంబ-ములకునిండ
నెలఁతిలకునంతఁ బండ్రెండు-నెలలునిండ॥ ౧౫౨॥

మ. మధుమాసాగతశుద్ధశుద్ధనవమీ-మధ్యాహ్నకాలంబునన్
బుధవారాదితితారఁ గర్కటకస-త్పుణ్యోదయలగ్నంబున
న్విధుఁడే వేల్పులు గూడఁగా విధిముఖు-ల్వేదక్రమంబుశంసింపఁజ
క్రధరాంశంబగునొక్క-పుత్త్రుఁ గనియెం-గౌసల్య సాఫల్యయై॥ ౧౫౩

సీ. ఘనతరుల్సుమనోవి-కాసతఁజెన్నొంద,
భువనముల్కల్మషం-బులదొలంగ।
విపులధర్మములభి-వృద్ధినొందఁగఁగ్రా,
మ్యార్తిసంతసమువి-బుధులకొదవ।
సప్తాంగసహితరా-జప్రవర్తనముఁగా,
ద్విజకులంబురుచులా-ప్తినిరహింపఁ
కువలయామోదంబు-కుమ్మరింపఁగఁబుణ్య।
జనజాతమునకుప-ర్వనముగాఁగ।

గీ. శర్వదినశార్వరీనాధ-గర్వనిర్వ।
షణ్ముఖుండుధరిత్రీసు-పర్వవరుఁడు।
పర్వసుముఖుండులోచన-పర్వయశము।
శర్వపూర్వగ్రసతికిసం-ప్రభవమయ్యె॥ ౧౫౪॥

గీ. విబుధహర్షంబుకువలయ-వికసనంబు।
పుణ్యసుచకోరలోచనా-పూర్ణసంత।
సప్రవృద్ధియుఁబటుతమ-శ్శాంతియయ్యె।
ననఘమతిరామచంద్రుని-జననవేళ॥ ౧౫౫॥

క. గ్రహబాధలాతనియను।
గ్రహమాత్రంబునన-పాయఁగలవనెడిసుధీ।
గ్రహజన్మలగ్నమహిత।
గ్రహలగ్నముచింతగాదు-రహినూహింపన్। ౧౫౬॥

క. సంతానమధిపుఁడొందఁగ।
సంతానముగురిసెదివిజుల-సంతానంబుల్।
వ్వంతలుపోఁగిరమరులా।
వంతలువేదండసార-వంతాత్మకులై॥ ౧౫౭॥

క. అగ్రసతీమణినలవని।
జాగ్రసుతోత్పత్తివినిన-పాగ్రణిగణంబ్రు।

త్యాగాగ్రహారములనుదీ।
నగ్రగ్రహణయుతుఁడైద్వి-జావలికొసఁగెన్॥ ౧౫౮॥

సీ. విమలమానిహృదబ్జ-వృత్తికినూతికా,
గృహవృత్తిమనమున-కెక్కెఁబోలు।
నభవాభ్యభిష్టుతుం-డైయొప్పఁప్రభునకుఁ।
బుట్టువుపైనిచ్చ-పుట్టెఁబోలు।
దుగ్ధాబ్ధిలోలాడు-దొరకుఁగౌసల్యకు,
చోరుదుగ్ధాపేక్ష-యొదవఁబోలు।
నాగదుమహతీస్వ-నముమెచ్చుమేటికిం,
గనలజోలలభ్రమ-గలుగఁగఁబోలు।

గీ. శేషుపైఁబండునట్టివి-శేషమతికిఁ।
దూలతల్పంబులధికమై-తోఁపఁబోలు।
ననఁగనిందీవరశ్యాముఁ-డఘువిరాముఁ।
డమితగుణధాముఁడుద్దాముఁ-డవతరించె॥ ౧౫౯॥

క. దశదిగ్విశదముగవిప।
ద్దశదిగ్విభులెల్లఁబాయఁ-దగుమీనమునం।
దశమిగురువారమునం।
దశరథుసతికైకగనియెఁ-దనయున్నయున్॥ ౧౬౦॥

మ. కవివాశోరగతారఁగర్కటకల-గ్నప్రాక్శైకాదశిం।
గవివారాభినుతుల్సెలంగజగదే-కశ్లోకవిఖ్యాతులన్।
సువివేకాత్ములనిర్వురంగనియెన-త్యుగ్రోరుచారిత్రబాం।
ధవసంస్తోత్రసుమిత్రమిత్రజాబ్యం-దంబాత్తహర్షింపఁగన్॥

వ. ఇట్లు. ౧౬౧॥

క నలగురురూపశోభధుర్యులు।
నలుగురుసుతులుద్భవింప-నలువుగవిరివా।

నలుగురియన్వేల్పుంజా।
నలుగురుతరనాట్యములనొ-నర్చిరిమింటన్॥ ౧౬౩॥

క. పాపంబులుభక్తునక।
స్తాపంబులుఁబాపనోపు-తద్బాలురస।
ప్రాపంబులుపురిటిండ్లకు।
దీపంబులుగాఁజెలంగె-దీపితభంగిన్॥ ౧౬౪॥

క. పురుషోత్తములగుపుత్రులుఁ।
బురుషార్థచతుష్టయంబుఁ-బోలెంగనికా।
పురుషామిత్రజనమదం।
బురుషాసహితముగన్నపుఁడు-బ్రుంగుదువలచెన్॥ ౧౬౫॥

వ. తదనంతరంబున. ౧౬౬॥

సీ. పుణ్యాహవాచన-పూర్వకజాతక,
ర్మానంతరంబున-మానవేంద్రుఁ।
డతిభక్తిఁగులగురుం-డగువసిష్ఠునిఁగాంచి।
నతుఁడయిసుతులకు-నామకరణ।
మొనరింపుఁడనుఁడుస-యోగిముఖ్యుండుఁగో।
సలరాజకన్యకా-సత్సుతునకుఁ।
గైకపుత్త్రికమా-గధరాజపుత్త్రికా,
పుత్త్రులకునుగ్రమం-బుననొనర్చె।

గీ. రాముఁడనిరాముఁడను ముఖ-రతుఁడుగాన।
భరతుఁడనిలక్ష్మణుఁడుగానఁ-బరఁగలక్ష్మి।
ణుండటంచునుశత్రుఘ్నుఁ-డింద్రుగాన।
మహిమశత్రుఘ్నుఁడనుచునా-మంబులపుడు॥ ౧౬౭॥

చ. క్రమమునవాద్యులక్ష్మిమహి-కాకిరణోరుకళోపమానులై।
సుమవిశిఖాపరీణపటు-సుందరులైవినుతాంబుజాననా।
ద్యమరులనైనరేశ్వసుఁడు-నాబలుసంతసమందమిత్రుఁడో।
క్రమమువెలుఁగంగరాసుతులు-తద్దయునొప్పిరినాఁడునాటికిన్॥

గీ. తల్లిదండ్రులసంతోష-వల్లిఁబ్రాఁకఁ
బ్రాఁక నేర్చిరిచిలుకల-పలుకు లెలమిఁ
బలుక నేర్చిరి ధర్మము-ల్ప్రబలి నడువ
నడువ నేర్చిరి వెడ వెడ-నడకలపుడు॥ ౧౬౯।.

ము. కని మోదించిరి తల్లిదండ్రులు జగ-త్కల్యాణచారిత్రులం
న్వనజాతాయతనేత్రుల న్విమలశో-భాగాత్రులం బౌరలో
చననీరేరుహమిత్రుల న్మధురభా-షాచిత్రుల న్మిత్రకా
ననసచ్చైత్రులఁ గూఢజత్రులను నా-నాస్తోత్రులం బుత్రులన్॥

వ. అని మనోల్లాసంబుగా నుపన్యసించి॥ ౧౭౧॥

క. భండనరిపుఖండనఖుల
దండనగుణమండవాని-తాంతప్రణుతా
ఖండలమణికుండలభూ
మండలధరవిధుదినేశ-మండలనేత్రా॥ ౧౭౨॥

శా. జంభారాత్యభియాతిఖండనపటి ష్ఠప్రోల్లసత్ఖడ్గదో
స్తంభాభిష్టుతభూరిభూరిమణిదృ-బ్భద్రస్ఫుటోద్దామదా
మాంభోద్యాత్మభవాసమాశ్రితసుప-క్షాదీనరక్షాంచితా
రంభాదంభమహాభిలాషుజగదా-రాధ్యాంఘ్రిపద్మద్వయా॥ ౧౭౩॥

లయగ్రాహి.

సారఘనసారసువిసారసుమవారపటుహీరవరక్షీరధ్వ్రతసీరసితతారో
దారఘనపారదపటీరహితశారదనశారమణశారదశరీరమృదుముక్తా
హారమఘవత్పూరసురవారణ మీరణకుమారవరహారవరహారవిలసద్డిం
డీరబహుతారకతుషారకలికారిమణకైరవమహోరగపచారుతరకీర్తీ

గద్య॥ ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణ భూమధైర్య
వినయ రామనార్యతనయ పండితసేవాసముచ్చయ కొత్తపల్లి
లచ్చయప్రణీతంబైన దాశరథివిలాసంబను మహాప్రబం
ధంబు నందేకాశ్వాసము.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః.

# దాశరథి విలాసము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీమహనీయవదనవర!
రామాజనమదనకుంద-రదనరిపుమహా!
భీమకదనరుచిరసువ!
గ్రామేయచ్ఛదనవేంక-టాచలసదనా॥ 1॥

వ. అవధరింపుము మనంతర కథావిధానంబు భగవంతుండగు వల్మీకోద్భవుండిట్లని చెప్పందొడంగె. ౧॥

క. తమతలిదండ్రులకానం
దమధికమగుచుండ రాజ-తనయులువిప్రో
త్తమకృతదీవను లైయు
త్తమవృత్తము పొదలకుము-దంబొనరింపన్॥ 3॥

గీ. రామలక్ష్మణులుమనోభి-రామలీల
భరతశత్రుఘ్నులురుశుభ-భరితలీల

గవలుగాడిరిజక్కువ-కవలఁ బోఁడు।
వేలుపులకూడుఁగూడున-వ్యథము గాఁగ॥ ౪॥

శా. విద్యాభ్యాసివసిష్ఠునొద్దనుజు-న్వీతంబుగా నెంతయు।
న్విద్యాభ్యాసమొనర్చి రాముఁడు మహా-వేదేద వేదాంగము।
ల్విద్యాసాధనియట్ల నేర్చి మఱియు-న్వీతుండు బ్రహ్మోద్యదన।
ర్విద్యాపారఁగుఁడయ్యె ధీమహితో-ర్వీనాయకుల్గుందఁగ౯॥ ౫॥

చ. గజబిజశేకవీఁకఁదురఁ-గంబుల నెక్కి రణంబొనర్చుట।
ల్గజముల నెక్కి పోరుటలి-లాస్థితిజన్యము సేయుటల్పతాం।
గజలదయుక్తిఁగాండపటు-కాండపరంపరఁ జూపుటల్వరాం।
గజనిభమూర్తి రాముఁడధి-కంబుగ నేర్చె సహోదరాత్తుఁడై॥ ౬॥

వ. అంత. ౭

క. దారకులవ్వందితబృం।
దారకులందుష్టజనవి-దారకులఘుహో।
దారకఠణావిశేషుల।
దారకరాజనిభముఖులఁ-దారకనఖుల౯। ౮॥

మ. కనిరాజన్యఁడు బుత్రరత్నములఁ గం-గళ్యాణనుశ్చేయుఁజ।
క్కనిరాజన్యసుకన్యలన్వెదకుచో-గాధేయుఁడామర్షణో।
కనిరాశక్షణుఁడేమ దెంచుటయు వే-గంబొప్పనమ్మానిరా।
కనిజాధీశునకేర్పరించిరిభటుల్-గాతూహలోపేతులై॥ ౯॥

క. భటులిటుతెలిఁగించినను।
ద్భటసంతోషమున నెదురు-పఱతెంచి కుభా।
ర్భటులెసఁగఁదోడితెచ్చె౯।
భటునిక్రియ స్నేహితవినయ-భయభక్తుండై॥ ౧౦॥

వ. ఇవ్విధంబునం జితేంద్రియామిత్రుండగు విశ్వామిత్రుం దోడి తెచ్చి సుఖాసనంబున నాసీనుం జేసి॥ ౧౧॥

క. మునికౌశికుఁడగుగౌశిక।
మునికర్ఘ్యముఁబాద్యమొసఁగి-యుదమునరవిధా।
మునిపాదశౌచవరజల।
మునిజశిరంబునవహించి-బుధులునుతింపన్॥ ౧౨॥

గీ. కాయముఁబవిత్రమయ్యెఁద్వ-దీయపూజ।
నమునయుష్మత్పదాబ్జర-జమునగృహము।
నమితశోభనములకిర-వయ్యెశిష్య।
కోటికినిమాకుఁగుశలమే-కుశికవంశ॥ ౧౩॥

క. ప్రాణతనుత్రాణధను।
ర్వాణకృపాణంబులునుగృ-పాపరయుష్మ।
త్రాణపదస్త్రైణపదా।
క్షీణతలునునీయవియకు-శికవంశమణీ॥ ౧౪॥

క. పాచ్చెంబుగనాడుటగా।
దచ్చెరువుగనిటుడమీర-లందఱుఁజూడం।
జిమ్ముఁజోయమన్నఁజొచ్చెద।
వచ్చినపనియానతీయ-వయ్యమహాత్మా॥ ౧౫॥

వ. అనియిట్లు ముస్తకన్యస్తహస్తుండైయున్న దశరథునకు విశ్వామిత్రుండిట్లనియె. ౧౬॥

క. సత్యాధారకులోత్తమ।
సత్యసదాధారరాజ-సత్తమభాషా।
సత్యాశ్రయచిత్తమహా।
సత్యాంచితరూపవినుద-శరథమహీశా॥ ౧౭॥

చ. కుశలమతిన్వసుంధరర-ఘుక్షితిపాలునియట్టులన్నిరం।
కుశగతిరక్షనల్పొదన-ఘుండవుధర్మమతింద్విషద్గణాం।
కుశయవణాంకువంశనృప-కుంజరకావునమాకుసర్వముం।
గుశలమయంచుసాధుసము-ఖుండువపోమహితుండువెండియున్॥

క. ద్రోహులు గాధాన్వయస్య
స్నేహుల పంచేహుల తిని-షిద్ధాశ్రమిశ
ద్దేహులు ఖలమారీచసు
బాహులు చండతరదీర్ఘ-బాహులు పెలుచన్॥ ౧౯॥

ఉ. తివిరి మఖంబు సేయుటకుఁ-దీక్ష వహించితి నేని వాతునీ
తివిడిచి యజ్ఞవస్తువిత-తింబలు మాఱు సురక్తవర్షము
ల్దివిని వసించి మించి పటు-తీవ్రగతిం గురియింపు చుందుర
ద్దివిజవిరోధులధ్వరము-దీర్ణతఁ బూర్ణము గాక యుండఁగన్॥ ౨౦॥

ఉ. వారిరుహాప్తవంశజన-వల్లభ వారిటు లెన్ని చేసిన
స్వారి శమించుటం దపము-వశ్యము లోపము నొందుఁ గాన దే
వారివిభేదనక్రమము-నాత్మఁ గడుం దలపోసి సత్కృపా
పారధి వైన నీకడకు-వచ్చితి మెచ్చితి నీదు భక్తికిన్॥ ౨౧॥

శా. ఆపాపాత్ములసంహరింపఁగ మదీ-యం బైనజన్మంబు నెం
తేపూర్ణంబుగ నిర్వహించి విలస-త్కీర్తిం బ్రతిష్ఠింపఁగా
నీపుత్త్రు న్రఘురాముఁ బంపు మితఁడా-నీరేజపత్త్రేక్షణుం
డీపృథ్వి న్నరుఁడై జనించె ఖలశి-క్షేచ్ఛన్ ధరిత్రీశ్వరా॥ ౨౨॥

ఉ. ఈతఁడు సర్వలోకగురుఁ-డీతఁడు దానవలోకభీకరుం
డీతఁడు మాధవుండు మతి-నీతఁడు మాధవభావభావితుం
డీతఁడు సర్వభూతహితుఁ-డీతఁడు భూతలధారి గావునం
భీతి యొకింత యేని మహి-భృద్వర పొందకు పంపు మింపునన్॥ ౨౩॥

వ. అనిపల్కి శ్రీరాము నుద్దేశించి. ౨౪॥

గీ. దానవారితలీలని-ద్దానవారి
దానవారిగజంబు చం-దానవారి
ముఖకమలములు నిజశీలి-ముఖకరహతి
బ్రవచ్చఁగల్యాణయుక్తుఁడై-వచ్చు మిల॥ ౨౫॥

గీ. అనుడున వాక్యములు విష-మగుచుఁ గర్ణ।
రంధ్రములఁ బడి హృదయాంత-రంబు నిండఁ।
బ్రజ్ఞ చెడెను తలగ్నంబు-భగ్నమయ్యె।
మేను మాన్పడయ్యెఁ బ్రాణంబు-క్షీణమయ్యె॥ ౭౬॥

క ఉల్లము జల్లుమనఁగ మో।
మెల్లను వెల్లఁదన మూన-నింద్రసఖుఁడు భూ।
వల్లభుఁ డల్లవనమ్మని।
తల్లజుఁ బలుకున్న నంబు-దల్లడపడఁగన్॥ ౭౭॥

క. తండ్రి విను రాముఁడెక్కడ।
గండ్రలు రాక్షసులు వారిఁ-గైకొనక కడుం।
దీండ్రించి నిలుచు టెక్కడ।
వేండ్రము లీమాటలు డిగి-విను నాపలుకుల్॥ ౭౮॥

సీ ముఖపద్మ సౌరభో-న్ముఖముఖరిత శిలీ,
ముఖ విముఖుండు దా-మ్ముండు గతహ।
ముఖమునఁ బూర్వాగ్ని-ముఖ శిలీముఖపరా,
జ్ముఖుఁడగు హరి దేవ-ముఖసురప్ర।
ముఖులు షణ్ముఖుఁ గూడి-మొనయ లేరా దుర్ము,
ఖుల రాము దెసను సుము-ఖుఁడ వగమ్ము।
ముఖవిలోచన చతు-ర్ముఖ సతీ సాహస్ర,
ముఖ యశ సగితది-జ్ముఖము నింద్ర॥

గీ. ముఖ్యదంతప్రభు నీదగో-ముఖయటంచుఁ।
గరముఖర కరవంశశే-ఖరుఁడు ధైర్య।
ధనముఖుండితమగుడుఁ జి-త్తము గలంగ।
ముఖము వివర్ణమై చెమా నిస-మ్ముఖము నందు॥ ౭౯॥

చ. ఇటులనఁ దోమఖుండె యిడ-శేంద్రియ వృత్తులు మాని మానిదై।
కిటకిటలాడి కొంతవడి-కిన్కఁ గమెత్తిన రేంద్రచంద్రుఁడు।

క్లిష్టమగుపుత్రశోకము నఁ-గూరియుఁ భర్తృవియోగ మొందియుం
బటుగతినున్న వారలయు-పాపము రూపము లొందెనో యనన్॥

క. వసుధాసుధాశనులుఁగొలఁ
వసుధర్తసభానివాసి-విగుణిబుధపనీ।
వసుధారణశక్తింగదు।
నసమర్థుఁడవైతివిట్టు-లాశ్చర్యముగన్॥ ౨౫౩॥

వ. అని మతియుం బెక్కుభంగుల విలపించి కంగూఁగౌసల్య॥ ౨౫౪

సీ. జననాథనినుఁబరు-సంబులువలికిన,
ఫలమిప్పుడనుభవిం-పంగవలెఁ।
గతివనిర్ఘాతప్ర-ఘాతంబునదపించు,
జనునకుఁగొఱవిచూఁ-డిన విధమునఁ।
బుత్రవియోగతఁ-బావయుచునుండఁగ,
భర్తృవియోగసం-ప్రాప్తమయ్యె।
వనవాసమునకేగు-తనయునిఁగాంచిన,
మందభాగ్యవటంచు-మదిజనించుఁ।

ఆ. గోపమోమదీయ-పాపవిశేషమో।
యొట్టినోముఫలమొ-యోనెఱుంగ।
నాగుణంబుఁబిన్న-నాఁటనుండియునెఱిం
గియునుబలుక వమి-కృపదలిర్ప॥ ౨౫౫॥

వ. అని మఱియుం బరిచారికాసహస్రంబులుం దానునుం బలవించు నె
లుంగులునింగిముట్టె నయ్యవసరంబున॥ ౨౫౬॥

ఆ. పుత్రుఁగుఱిచిభూవిభుండులోకాంతర।
వాసియగుటవినియు-వానిసీత్వ।
హానికోర్వలేక-నడలుచుఁజనుదెంచె।
భరతుమరితబాహు-భరతమాతః ౨౫౭॥

గీ. తనయులిర్వురదెమ్మని-ధాత్రిపునకుఁ।
దహనకర్మమునడుపుట-ధర్మమగుట।
భరతశత్రుఘ్నులనుఁబిలు-వంగనిపుడ।
బంపవలయునుజాంఘిక-ప్రవరభటుల॥ ౨౬౫॥

వ. అనిపలికి సమస్తజనానుమతంబు వడసి దశరథుకళేబరంబు తైలపక్వంబును సుగుప్తంబునుం గావించి॥ ౨౬౬॥

సీ. పటుజవసత్త్వసం-పన్నులభటులఁగ,
న్గొనివసిష్ఠుండిట్టులనియెవారు।
కృతమతికేకయ-క్షితిపతిపురినున్న,
భరతశత్రుఘ్నులఁ-భరితయశుల।
గాంచిమిమ్ముఁబుచ్చె-కార్యంబుగల్గితో,
డ్కొ-నిరండటంచుమీ-కులగురుండు।
మములంపెననివాని-మామయానతినొంది,
వారునుమీరును-వడిగనటకు॥

గీ. గదలిరండనిపలుకనా-క్షణమయవ్వ।
సిష్ఠునకుమ్రొక్కివీడ్కొని-చేరఁజనిరి।
సప్తరాత్రంబులకుసుద-క్షప్రధాని।
రమణమగుదానిఁగేకయ-రాజధాని॥ ౨౬౭॥

క. ఈకరణివేగిలోపలి।
శోకముదెలిఁదోఁపనీక-సూచకశోభనన।
కేకయభూపతిఁగనిమతి।
కైకాసుతుసోదరయుతుల-గనవలెంగుదున్॥ ౨౬౮॥

క. చెడుకలలుగాంచిచింతిం।
చెడుభరతుఁడువారిముఖము-శేశయములఁదోఁ।
చెడుదైన్యముఁగనుగొనితో।
చ్చెడుచిత్తముతోడమిగులఁ-జిడిముడిపడుచున్॥ ౨౬౯॥

వ. ఉన్నంతనబ్భటపుంగవులు॥ ౨౭౦॥

ఉ. హృదయవికారము ల్దెలియ-నీయక నాతనిఁ గాంచి గూఢగా।
ద్గదిక నెలుంగు లొప్పనెడఁ-గాధరణీశతనూజ మాగుసుం।
డు సమాన తేజుఁ డాయ్యెఁడుఁగ-డు స్వసఁ దోడఁజొ నిరందుశాత్రవో।
న్నవహృచ్చిచారుకీర్తిపరి-ణాహరతు ల్భరతు స్సహోదరు౯॥ ౨౭౧॥

క. అని చెప్పి నాఁడు పనియిది।
యని చెప్పం డవ్వసిష్ఠుఁ-డనిన విని భయం।
బున రామునకై వ్వార।
గ్గొనరించిరొ తండ్రి యెట్టు-లుండెనొ యనుచు౯॥ ౨౭౨॥

ఉ. మేఘవపుంక సోదరస. మేతుఁడు కేకయరాజపుత్త్రికా।
సూనుఁడు దిగ్వధూజనక-చొపరిశోభితకీర్తి సూనుఁడా।
స్థానము సొచ్చి యామఁగని-తద్విసమంతయుఁ దెల్పి బంధుసం।
తానము సంభ్రమింప విశ-దస్థితి నిట్లని యొస్భయంబు౯॥ ౨౭౩॥

క. నామనవి నాలకింపుము।
నామనము గలంగె నీక్ష-ణంబయ యొధ్యా।
నామనగరికేగ కతగు।
నామన వారలకు జూడ-వరిగె నవనఘా॥ ౨౭౪॥

క. అనితనమామయు ధాజి।
జ్జన నాయకు వీడుకొని ల-సద్వసనసువ।
స్తుని కాయమాతఁడో సఁగిచెఁ।
గొనిభరతుండను జాఁగూడి-కోసరయముగ౯॥ ౨౭౫॥

క. సముచిత పరివారసమే।
తముగా సాకేతరాజ-ధానికిఁ బురుషో।
త్తముఁడు భరతుఁడు సనియె।
ద్భ్రమితహృదయుఁడగుచు వేగి-రపు బయనముల౯॥ ౨౭౬॥

వ. ఇట్లు చని. ౨౭౭॥

గీ. రమణిలేని గృహమునంబ-రమణిలేని।
యాపంచు శూన్యమని స్త్రైజ-మైనభంగి।

మున్న పురిఁ గాంచి విపులవి-పణిహర్మ్యాదయముఁ।
డగుచు నిట్లని తలపోసె-నాత్మలోన॥ ౧౪౯॥

చ. తనపతి లేనిమానినివి-ధంబునఁ జాల నమంగళంబునౌ।
దినమిది యుత్సవంబుగదు-దీనమనస్కులు పౌరు లెవ్వరిం।
గనినను మేలువల్కర న-ఘంబగు వేదనినాదమింతయుం
న్వినఁబడ దేమిరొక్కొ పృథి-వీపతి మేనుఁ దొలంగెనే మొకో॥

వ. అని వితర్కించుచు మం జనిచని. ౧౫౦॥

శా. సత్రాసస్థితి నార్తిమూర్తి నిధరిం-చం బోలు నానొప్పిదై।
ద్యత్రాతౌపశవహ్నిప్రవృత్తియయి దై-న్యస్తోమసంస్థాయియై।
శత్రుఘ్నుం డడుగుల త్మజానుజుండుఁ బ-శ్చాద్భాగసంవర్తిగా।
మాత్రాగారముఁ జేరఁ బోయి భరత-క్ష్మాపాలుఁ డత్యాదృతిన్॥

ఉ. కేకయరాజనందనకు-కృత్రిమభంగి నమస్కరించియు।
కేకయరాజు సేమ మెఱిఁ-గించియుఁ గించుక తాల్మి లేమినా।
కాకరిమార్తికాకరము-గాఁగ తమేమి పురంబు నామదిన్।
శోకము సేయఁజొచ్చెఁ గల-చొప్పు సమస్త మెఱుంగఁ జెప్పుమా॥

క. మనమున భయసంభ్రమములు।
పెంగొన నిట్లనుచు మన్న-ప్రియనందనుతో।
మునఁ బాడికి నిలిపి కేకయ।
తనూజ యిట్లని యెఁ గాఢ-ధైర్యస్ఫూర్తిన్॥ ౧౫౩॥

ఉ. రాజవరుండు దొల్లి నను, మెచ్చి వరద్వితయం బొసంగ, బు।
త్రా జటలూనియగ్రవని-తా సుతుఁ డబ్దచతుర్దశంబున।
వ్యాజమునిస్థితిన్వనవి-హారము నార్పఁగ నీవు సర్వధా।
శ్రీజనమాన్య దవ్వసుమ-తీపరిపాలన మాచరింపగన్।। ౧౫౪॥

క. అగ్రసతీసుతువిభవో।
దగ్రునిఁ గావింప నాత్మఁ-దలఁచు దురాశా।
ప్రగ్రహనిబద్ధబుద్ధిం।
బాగ్రణి నడిగితిని యోగ్య-మగు సమయమునన్॥ ౧౫౫॥

క. ఏవరించినవరయుగ|
మోవఁగ నురుఁడును సూన- రేంద్రుఁడె యూనం|
బూనినఁ దాక్షి నెలుతం|
బూనిన దె రాముఁ డడవి-పాలములఁ దిరుగన్|| ౨౭౭||

చ. తనప్రియపుత్త్రిఁ దగ్గవని- తాళవ్రేఁ డాత్మసతీసహోదరు|
ల్వనుఁ గొన బ్రహ్మచర్యముని- వృత్తములూని చతుర్దశాబ్దము|
ల్వనినివసింపఁ బోయినభ- వజ్జనకుండిటఁ దద్వియోగసం|
జనితపృథువ్యథావ్యధితస- న్మనుఁడై మృతినొందెఁ గావునన్||

క. విక్రమసమృద్ధిధరణీ|
చక్రావనమాచరింప- జనకునిపిత్ర్యలో|
క్రియలుపక్రమింపక|
త్క్రతువిధతేజనీకుఁ- దనుపములనిన్|| ౨౭౯||

వ. భరతుండు మహింబడి మూర్ఛిల్లి కొండొకవడికిం దెలిసి.

క. రాముని సద్గుణమతికు|
త్రాముని లోకత్రయాభి- రాముని నాత్మా|
రాముని వనములఁ దిరుగఁగ|
నేమని పొమ్మంటి బుద్ధి- హీనతఁ దల్లీ|| ౨౮౦||

క. క్షితిపతిఁ జంపితివివన|
క్షితికంపితిసుతుని రాక్ష- పిలిగాకయనిం|
దతకేకయాన్వవాయో|
దితయగు సతికింత దుర్మ- తిత్వము గలదే|| ౨౮౧||

శా. చేతోజాతిసమానరాము వనవా- సింజేయు దుశ్చింతత్వ|
చ్చేతోజాతమొ రాక్షసీతులితదా- సీజాతమోహాకళా|
క్షేత్రప్రేరితమో మదీయసుయశో- నిర్వాపణాయాతమో|| ౨౮౨||
మాతా మత్పితృప్రత్యుహేతువిదసా- మాన్యంబుగా దారయన్||

సీ. నను రాజ్యకాంక్షిఁ గాఁ- దనమనంబున నవ్వ,
పిట్టుఁ దుగదు మాహా- సేయు నోకొ|

యతివనీగర్భమం-దావిర్భవించుట,
కకటనాపూర్వజ-న్మకృతి మొకొ।
ముద్దులుఁగులుకు రా-ఘవముఖాంభోజంబుఁ,
గనుఁగొనఁగానింకఁ-గలుగదొకొ।
నారచీరపటంబు-మనమునవిడికొని,
కౌసల్యవనఁగని-కనలునొకొ।

గీ. యొక్కయడుగునదుఃఖ-మోపదుజానకి।
యెట్టులడవిసంచ-రింపనొకొ।
జనులుభరతుపమిత-సౌజన్యనిధియని।
పొగడుదురుపులింక-నెగడవొకొ॥ ౨౯౩॥

వ. అని పలికి కినుక వొడమి. ౨౯౪॥

ఆ. నిన్నఁజూడరాదు-నీతోడభాషింప।
రాదునిన్నుఁజంప-రాదునాకు।
నిచటనుండరాదు-హీనపాపమతీయు।
టంచువెడలిభరతుఁ-డనుజుఁగూడి॥ ౨౯౫॥

వ. అత్యంత చింతాక్రాంతాంతఃకరణుండై దీనమనస్కులగు కౌసల్యాసుమిత్రాదేవుల కడకుఁజని నమస్కరించి కన్నీరుమున్నీరుగా నేడ్చుచున్నంగనుంగొని॥ ౨౯౬॥

క. చిత్తంబులనుత్తలములు।
క్రొత్తలగుమనత్తరుణులు-గొడుకులదుఃఖా।
యత్తులనెత్తిపదంపడి।
మొత్తంబుగనేడ్చిరొక్క-సెంగినభమదుర్వర॥ ౨౯౭॥

వ. మఱియును శోకవిధంబుఁదెలవింపనెడఁగౌసల్య॥ ౨౯౮॥

చ. భరతుఁడరాముఁడుగ్రవన-వాసముసేయఁగఁజేసెఁదుసద్యశో।
భరతుఁడు రాజముఖ్యుఁడుభ-వజ్ఞనుండమరత్వమొందెడు।
భరతిరపుత్రశోకమునఁ-బట్టణమానెయరాజకంబునం।
భరితమనఃప్రమోదినివి పొమ్ముఁగాఖ్యనుభూజ్యరాజ్యముల్॥

వ. అనుటయు సహింపక॥

చ. చకితహృదబ్జుఁడై పురుష-సత్తముఁ డబ్భరతుండు వెచ్చనూ।
ర్చి కినుకఁ దక్కి-విస్మితగఁ జెప్పెద నా మది రాజ్యవాంఛలే।
మికి ఘనపంచభూతములు-మిత్రశశాంకులు సాక్షులీవెఱుం।
గ కిటులు నోర్వఁ బల్కెదను-కంపడ దలంపవు కోసలాత్మజా॥ ౩౦౧॥

క. అనితఁడు రామభక్తుం।
డనూఁ పుణ్యాత్ముఁడు-డిమ్మహాత్ముడు భరతుం।
డనినయది తథ్యమనుచుఁగ।
గనవాణి వచించెఁదగ స-కలజనులు వినన్॥ ౩౦౨॥

వ. ఇట్లు వచించుటయు నెల్లజనంబులు నచ్చెరువునొంది భరతుం బ్రశంసించిరంత॥ ౩౦౩॥

క. భరతునిఁ గాఢాదరత।
త్వరతం గౌసల్య మెడలు-పట్టుకొని విశే।
షరవంబున నేడ్చెం ద।
త్పరిచారిక లధిక శోక-భరమున నేడ్వన్॥ ౩౦౪॥

వ. తదనంతరంబున భరతుం డనుజసహితుండై తైలద్రోణినిమగ్నాసం గ్రహించియున్న పితృశవంబుఁ గనుంగొని యుల్లంబు జల్లనఁ గొల్లం బోయి తల్లడంబు పెల్లివిరియ నల్లమృతుండగు నయ్యిక్ష్వాకువల్లభు తల్లజుం బేర్కొని॥ ౩౦౫॥

క. పేర్మి మాస్పదవినుమామా।
తామహపురిఁ జూడఁ జనిప-దంపడి రామా।
తో మాటలేన వేటికి।
రామద్రోహులము గాము-ర జవతంసా॥ ౩౦౬॥

క. పుర పాపహరిస యది భవ।
త్పరిపాలన లేమిఁ జేసి-పరిపంథితర॥।
పరిపాటవపండితతి।
త్వరపార్థివవంశముఖ్య-పక్షిరథాఖ్యా॥ ౩౦౭॥

క. వసుధాధిపవృత్తి కాసుతుఁ
డనుతలపునఁ జేసి ఘోరమగు మూర్ఛను విం
గిన ప్రియపుత్రకు శత్రు
ఘ్నుని గాఢాదరత నెత్తికొనవిదితగునే॥ ౩౦౯॥

వ. అని మఱియుం దదీయగుణంబు లగ్గించి విలపించు సచివు లూఱడించి
నఁ దెలివినొందక పితృమరణశోకానలసంతప్తచిత్తుండగు భరతుం
గనుంగొని సకలగుణోత్తముండగు గురుండిట్లనియె॥

చ. శతసరవాధులని ప్రపులఁ జక్కఁడ జెవ్వి భాగమార్గసం
పతనఁ బ్రశస్తుఁ డావరిత-బాంధవుఁడుంగదు వృద్ధపుణ్యక
ర్తతుఁడు మహీతలస్థనుస-మస్తముఁ దాల్చి నభోగియోగతిం
గతిఁ వ్రపదవంబడుట-కార్గ్యమెయిన్నరనాథమాళికా। ౩౧౦॥

సీ. ఒకయిల్లు వాసి యొం-డొకయింటికేగిన,
వాసిజీర్ణములగు-వసనములను।
రోసి యాత్మచ్ఛదో-ద్భాసియైనట్టుల,
గాదె దేహాంతర-గమనమాత్మ।
నహుజ రామరణాది-వికృతులాత్మనికిలే,
వెములుఁడక్షుఁడున-నామయుండు।
శాశ్వతుండనిరం-జనుఁడనవిలసిల్లు,
నింతయెఱుంగక-నితరజనులు।

గీ. పంచభూతాత్మికంబు ము-ర్భలమురక్త।
మాంసమేదోస్థిదమ్ము-మలినమశ్వ
రంబునగు మేని చేటున-కుంబొగలుట।
తలఁచి చూడవివేకమ-తంబుగాదు॥ ౩౧౧॥

క. బంధురమగుజ్ఞానమునం।
బంధములేని మనము చాల బంధకమగుస।
ద్బంధుమరణశోకాంధత।
బాంధవుఁ గూలుదు సుధ్వంబు గజములెల్॥ ౩౧౨॥

క. అన్నదిసదృశీకృతసువి।
యన్నదిఁ దాఁటి గడచి భరతుఁ-డతిరయమునఁ దా।
నెన్నదిశకుఁ గురుతోఁ దా।
వన్నదిమదినూఁది నడచె-ననుజసహితుఁడై॥ ౩౨౯॥

వ. ఇవ్విధంబునం జని యెడనెడ వినోదంబులగు నదీనదంబులు తుంగంబులగు గిరిశృంగంబులు విశాలంబులగు సాలంబులు నాలోకించుచు సరయూ గంగా సంగంబు నుత్తరించి గంగాతీరంబు నకుం జని యుండు. ౩౩౦॥

ఉత్సాహవృత్తము.
సాధునీతిఁ గనియె రాజ-సత్తముండ సత్తతా।
శాధునీవిదాఘునఘు-శాలి శాత్మశాదుని।
స్వాధునిష్ఠుఁ దీనసత్ప్రి-సాధునిద్రసన్ననీ।
సాధురంధరుం గుహుం డ్వి-షాముఖర్వషాదునిన్॥ ౩౩౧॥

వ. ఇట్లు కాంచుటయు నగ్గుహుండు సాదరపూర్వకంబుగా భరతున కిట్లనియె. ౩౩౨॥

క. ఇలు వెలువరించి రాముని।
కలిమిం గొనియుంతనిలువ-కకలుషమతివై।
బలిమి మెయి నతని దలపడఁ।
దలఁచి యరిగితివొ ట్లు కుత్సి-తంపుదలఁపునన్॥ ౩౩౩॥

చ. అనవతఁడో నిషాదవిను-ముట్టులు గాదు మదగ్రజన్ముఁ డా।
జ్జనకసుతాసమేతు నృప-సత్తము రాముని లక్ష్మణుం జగ।
జ్జనుతకీర్తి నైద్వషద-సాధ్యకరూథ్యకుఁ దోడి తేమనం।
బునని టుపోక వీకగు నె-పోకడమాలి పలుక్ర వల్కఁగన్॥ ౩౩౪॥

చ. అనుటయు సంతసించి యతఁ-డాతని కిచ్చె హితార్ఘ్యపాద్యము।
ల్వను పడఁగా నొసంగఁదగు-భంగి గంగఁదరంగిణీమణిం।
బోఁతఁగ నుత్తరించి గుహుఁ-బోవిడఁ జివిరించి కృశ్యమై।
వ్వరికిం లఁఘునీయుమని-వార్యమునం ముఁదలం చుము స్వసన్॥ ౩౩౫॥

వ. భరద్వాజాశ్రమంబునకుం జని. ౩౩౬॥

క. అమ్మునిపతికి వినమ్రా।
రమ్మొనరించుటయు నాద-రమ్మున నిటు రా।
రమ్మని భరతుని కరముఁ గ।
రమ్మున గీలించి మునిక-రమ్ము నరక్తిన్॥ ౩౩౭॥

క. మనమున వగదక్క మునీ।
జనకుఁడు మృతి నొందె విధివ-శమ్మున నిటు రా।
మునిఁ గానఁ బోవు టెంతయు।
నమకూలంబయిన కార్య-మని సెలవొసఁగన్। ౩౩౮॥

క. వనవొప్ప రాముఁ డరిగిన।
వలను భరద్వాజముని-వలనఁ దెలిసియు।
వ్వలఁ జనియె భరతుఁ డెంతయు।
వలమదగుల్వడిన పులుఁగు-వలెనతిభయుఁడై॥ ౩౩౯॥

వ. ఇట్లరిగి విచిత్రకూటంబగు చిత్రకూటంబు సమీపంబునకుం జను నవసరమున. ౨౪౦॥

ఉ. ఎప్పుడు రామచంద్రముఖ-మేర్పడఁ జూతుము కన్నులారనిం।
కెప్పుడు రామభాషణము-లింపుగ వింటుము వీనులారఁ దా।
నెప్పుడయోధ్యకున్ మనల-నేలఁగ వచ్చును మిత్రులారయం।
చప్పుడు కేడ్కఁ బౌరజను-లారని రావము లుప్పతిల్లఁగన్॥ ౩౪౧॥

క. పలికెడు పలుకులు తురగ।
మ్ముల హేషలు మత్తనాగ-ములబృంహితము।
ల్గలసి బలిసియు క్రొ-వం।
గలశనువంబులకు భీతి-గలిగించుటయున్॥ ౩౪౨॥

క. తద్రవముం బక్షిమృగో।
పద్రవమున్లక్ష్మణుండు-పరికించియు దా।
గ్రద్రుమము నెక్కి కనియెన్।
భద్రంబుగ వచ్చుచున్న-భరతుని సేనన్॥ ౩౪౩॥

క. ధీశాత్మజుగు చుఁదవయిరు।
చేతులుఁగదుఁబిసికికొను చుఁ-జడిమ డివడు మ।
న్నీతవగ చెదివికెగిలె।
ధాత్రీతురగచారుకీర్తి-ధామా రామా॥ ౩౬౧॥

వ. అనిమఱియుఁబలవింపు నవసరమ్మున ౩౬౨॥

శా. కైకానందనుఁడన్నదమ్ములను భూ-కాంతాసుతం దాపక్వ।
చ్ఛ్రాకాపాస్త్ర సమర్ధవాత్రివికరసం-శుద్ధార్ధిలో ధాతిశాం।
తాకృష్టాత్ములఁ జేయుదున్నిహిరఖం-శ్యస్వామి రాముండుగం।
గాతూలంకనుఁ జేరియుండునిగ పెం-క్తప్రక్రియం జయ్యన॥ ౩౬౩॥

క. అనుజప్రియాసహితుఁడై।
మనుజప్రవరుఁడుదదంబు-మగ్నాత్ముఁడై।
జనకునకుఁదిలోదకవిధు।
లానరిఁ దీర్చికృత్యుఁడగుచు-నటజను సేరెన్॥ ౩౬౪॥

ఆ. ఇట్లు వచ్చిరాముఁ-డెరియుతునంబున।
వనుజవరులఁబట్టి- కానమహీశు।
గాశుగన్నాత్రిషా తె-సాశుగవాతిఁగూలు।
నగమువట్లపుణ్య-నగమునందు॥ ౩౬౫॥

వ. ఇవ్విధంబునం బిత్రుమరణ శోక వ్యాకులిత మానసుండైన రామచంద్రు భరతుండూరార్చుచున్న యవసరంబున గురుండు కౌసల్యా కైకా సుమిత్రలం దోడ్కొనివచ్చి సముచితంబుగాఁ దర్శనాగమంబు నడపుటయు రాముండు సీతాలక్ష్మణ సహితుండై కన్నీరు తొలఁ దదంఘ్రిపుష్కరభాగంబులఁ బడుటయు నక్కాంతలక్కొడుకులం గౌగలించి వీడ్కొనుచు నక్కలం గదియించి వెక్కి వెక్కి యొక్క గ్రుక్క దిక్కులుదిక్కటిల్ల నేడ్చిరి. మఱియును.

ఉ. ఎల్లజనంబులున్నివ్వఁగ-నీల్గిన పక్షీరధుం దలంచుచుం।
దల్లిత్రో యసద్గుణవి-తానము నవ్వుదు సేయుకొంచునా।

తల్లులుమువ్వురున్సుతులు-దారుణశోకభరంబునొందిరెం।
తల్లడమందియేడ్చిరవి-ధంబధిరోచ్చుట నైరవఁగల్గునే॥ ౩౭౭॥

క. క్షత్రియకాంతలుకోసల।
పుత్రియుఁ గైకయియు మగధ-పుత్రియు వగతోఁ।
బుత్రుల ధైర్యము ధాత్రీ।
పుత్రీ దైన్యంబుఁ గాంచి-పొగిలిరి మిగులన్॥ ౩౭౮॥

వ. అప్పుడు. ౩౭౯॥

ఉ. శోకులవోలికేగిఁ-జనప్రభుఁడూమఁ దలంచి చింతతోఁ।
నాకులపాలికాతిలక-యైనధరాసుత యేడ్చె వేడ్వఁగా।
నాకులపాటుఁ జెందెఁ గుసు-మాస్త్రులఁ బుష్పరపాత్రులొల్కఁ జు।
స్త్రీకులుఁ దద్విలాపమన-ఘానము గాఢముదిండలంపఁగన్॥ ౩౮౦॥

వ. తదనంతరంబున వసిష్ఠభరతప్రయత్నంబునం గొంతవడికిం గౌసల్యానందనుండు తెలివినొందుటయుం దక్కినవారు నుపశమిల్లిరంతం బౌరజానపదబ్రాహ్మణగురుబంధుభృత్యామాత్యప్రియానుజప్రియాసమేతుండై పవిత్రసమస్థలసుఖాసీనుండై రాముండుచితవచనంబుల నానందంబు గావించుచుండి కొండొకసేపునకు భరతునాననంబునం బ్రసాదమహితంబగు చూడ్కి నిగిడించి పితృనిర్దిష్టదిష్టంబిష్టంబుగ వనంబునం గడపి పురంబునకేను గడచవచ్చునంతకుం గరుణ గలిగి ప్రజాపరిపాలనంబొనర్ప నయోధ్య కరుగుము న్నాయని సప్రేమసాదర బహుళంబుగా నాడుటయు నతండు విషాదంబునొందియన్నం గనుంగొని॥ ౩౮౧॥

ఉ. భూతలనాథనాథరఘు-పుంగవ నాకొకధము దక్కినన్న నీ।
శీతలదృష్టిఁ జూడుము వ-చించెద రాజ్యభరంబు సర్వము।
న్నాతలఁ బెట్టఁజూచెదవు-నాతలపట్టులు గాదు నీవుధా।
తీవ్రలమేలఁ గావలవ-దేజగమెల్ల నుతించుచుండఁగన్॥ ౩౮౨॥

క. ఇనువభ్యుదయంబునఁ జ।
క్రనిశాయము రాజు కరుణఁ-గనికువలయమున్।

జనవరపాలుపొందుంజ।
యౌవరాజ్యము సేయఁబొంటె-నదు దమ్మునను॥ ౩౨౩॥

గీ. కేకయాత్మజ నడపిన-కృత్రిమంబు।
నించుకయు నెంచకుము భర-తృదయుఁడుందు।
సత్యసంగ్రహమూర్తి వీ-వఖిలభూభ।
రమ్ము వహింపుము పరమ్మావ-రమ్మునిమ్ము॥ ౩౨౪॥

క. వర్ణితాన్వాశ్రమములుఁ।
వర్ణాశ్రమధర్మములును-బసముజనదు।
ర్వర్ణమువర్ణములఁడఁగు।
న్వర్ణితుఁడగు రాజశేరి-వసుమతిలోనన్॥ ౩౨౫॥

ఉ. కావునవాదుప్రార్థనముఁ-గైకొనినీవు జగజ్జనంబులం।
గావునరాలిపత్కృషణఁ-గావినధర్మవృత్తి పయానముల్।
గావునరేంద్రధర్మములు-కారుణికత్వధురీణమేదనా।
గావనభూమినీకుఁడిపు-గందగు నేమనిగుందనీ క్రియన్॥ ౩౨౬॥

శా. క్షోణీభారమునిర్వహింపఁ హిత-క్షోభంబుఁ గావింపఁ నా।
క్షీణానందము భూజనాళికిఁ సఁగ-స్స్వ రామరమ్మావన।
క్షోణిన్నిర్భయరాము పొమ్ముము నా-కున్నీవు దెల్పంగను।
ప్రాణంబుల్వినుమందలంచితగుమీ-ప్రాణాపహేశంబుఁ నన్॥

క. చాలన్వాగ్భువనంబున।
నేలనివాసంబు నేలనేలఁగ మ్మీ।
చాలభూపాలనకునీ।
పాలనవసియింతు వరప్ర-పాలకమాళీ॥ ౩౨౭॥

వ. అనుటయు రాముండు మందస్మిత సుందర వదనారవిందుండై.

ఉ. తమ్ముఁడ వెత్తివాఁడవుగ-దా తెలసిన్భవదీయ ధైర్యమే।
నెమ్మియు రాజ్యపాలనకు-నియ్యకొనందగుఁదండ్రిపంపునన్।
వమ్మునవిల్పి కావలన-వశ్యము గుమ్మతివత్తునీవుపా।
ర్థమ్మునవాచరింపుము ప్ర-జాపరిపాలనము ప్రమాదివై॥ ౩౨౮॥

క. మనబోటివారలనెనకని।
పనుపున వర్తింపకునికి-పాడియె గుణమౌఁ।
డని నీ వెఱుఁగవె ధర్మువు।
ననఁగావింపకుము రాజ-నందన యింకన్॥ ౩౫౨॥

క. పితృభక్తి నేమఱకవై।
వ్రతపూజాపరుఁడవగుచు వసుమతియేలఁగ।
ధృతిమంతుఁడవై వత్సర।
చతుర్దశము బోవుమీ ప్ర-జలఁ బ్రజల క్రియన్॥ ౩౫౩॥

చ. అనుటయు నేమి యుందిరుగ-నాడక యుబ్బరతుండు రామచం।
ద్రనిఖిలభూభరంబు సుఖ-రంబుగ దాల్చుటయుంక నాకుఁద।
ప్పని పనియేని నీచరణ-పాదుకలావతి యిమ్ము తన్ముఖం।
బున మఱరాజ్యతంత్రము ప్ర-మోదమున న్నివహింతు నెంతయున్॥

క అనిసభఁ బ్రార్థించెడుతఱి।
మ్మునకుం బాదుకలొసంగి-మోదంబునరా।
మనరేంద్రుఁడు గాఁగిటనిడి।
కొనిసంభావించె భరతుఁడు-గుతుకమునొందన్॥ ౩౫౪॥

గీ. భరతశత్రుఘ్నులంత సం-భరితసత్త్వ।
హర్షమగ్నాంగులగుచుఁ ద-దంఘ్రియుగము।
మస్తకంబులఁ సోఁకన-మస్కరించి।
యపుడు వీడ్కొని రత నివ-సంతరమున॥ ౩౫౫॥

వ. శ్రీరాముండు దమ దెసకుమ్మలించు నమ్మువ్వురతమ్ములకుం దాపోపశో
షణంబులగు భాషణంబుల నానందంబునొందించి మొక్కివీ
డ్కొల్పి పౌరబ్రాహ్మణ భృత్యామాత్యజనంబులకు సముగ్రహప్ర
కామాదరసంభావనాపూర్వకంబుగా సెలవొసంగి వసిష్ఠానుజ్ఞా
తుండై సీతాలక్ష్మణసమేతుండై మగిడిపర్ణశాలకుం జనుటయు॥ ౩౫౬

గీ పాదుకలు భద్రకుంభికుం-భస్థలమునఁ।
బాదుకొల్పి ముదంబున-భరతయనుజుఁ।

భరతశత్రుఘ్నులుభయపా-ర్శ్వములఁబిములఁ
చామరచ్ఛత్రములుఁబట్టి-చనిరి సరగ॥ ౩౬౭॥

వ. ఇవ్విధంబున సమస్తబంధుజన పరిజనగురు పరివృతుండై చిత్రకూ
టంబువిడిచి భరద్వాజాశ్రమంబుఁగడచి గంగాతీరంబునకుఁజ
చి రట్టియెడ. ౩౬౮॥

కం. తత్కాలలతాపాలస
ముత్కరకలికాసురభిస-ముత్కటసుమసం
పత్కలితమగుచుఁదమకు
త్యుత్కలికమరుత్కిశోర-ముత్పాదింపన్। ౩౬౯॥

కం. దర్శనమాత్రముననఘా
దర్శనమొనరింపఁజాలు-తీర్నద్యుదక
స్పర్శనగంగాంబోప
స్పర్శనమునఁబ్రీతులైన-సమయమునందున్॥ ౩౭౦॥

గీ. ఎదురువచ్చినగుహునకు నిష్టమొసఁగఁ
దామువోయినకార్యమం-తయును వినిచి
యతనిదైన సహాయత-నతఁడు దాఁటె
రంగములువొంగఁదుంగత-రంగగంగ॥ ౩౭౧॥

వ. ఇట్లు సమస్తజనసమేతులై గంగానదీసముత్తరణంబాచరించి గు
హుండు ననుపనుచిత పయనంబులంజని తమసాస్రవంతింగడచి
సాకేతసామ్రాజ్యంబునకుంజని. ౩౭౨॥

కం. వెల్లిపిరియుత్తల్లడమున
దల్లులనందునిచియుద్భ-తపుమూలబలం
బెల్లను గాపునిచిమునం
బొల్లమినప్పురముఁజొరక-యుచితంపుమెయిన్॥ ౩౭౩॥

కం. స్వగ్రామమునుజ్జ్వలవ
త్స్వగ్రామమువదలికడు-యశఃపుంజంబుల్।

దిగ్రామంలగప్పఁగనం।
దిగ్రామముననుసించి-నిష్ఠాపరులై॥ ౩౯౪॥

వ. ఉచితపరివారసమేతులైయుండి రంతనబ్బరతుండు॥ ౩౯౫॥

చ. సుఖమున ధారుణీజనులు-సొంపువహింపలసత్సుఖక్రియో।
న్ముఖమున ధారుణీసురస-మూహము పెంపుగలిర్పఁబాదుకా।
ముఖమున రాజ్యకృత్యమ్ము ప-మోదమునన్న డువంగ రాజధ।
ర్మఖనియనన్వసించెమతి-మంతుఁడు రాముని రాక వార్చుచున్॥

వ. ఇట్లయోధ్యాపురసమీపంబున నొక్క. యలఁతిపల్లియ నుచిత వర్త
నంబుల నుండెనని చెప్పి ప్రమదాతిరేకంబున. ౩౯౭॥

శా. దైతేయప్రకటాటవీదహనభ-క్తత్రాణపారీణసు।
జ్ఞాతానాగతవర్తమానగతది-ష్టప్రక్రియాసన్నుత।
ఖ్యాతాఖ్యాతికృపారసప్రవవిశా-లాత్మాతిసంభావితా।
జ్ఞాతావాసమునీంద్రమానసనివా సాపీతవాసాంచితా॥ ౩౯౮॥

క. పంకజలోచనమునిజన।
పంకవిమోచనవిశేష-భాసురశ్రీవ।
త్సాంకకరుణాంబుసేచన।
పంకజభవకామివీప్ర-భావితవచనా॥ ౩౯౯॥

మత్తకోకిల.
పాలితాఖిలలోకనాయక-భక్తసౌఖ్యవిధాయకా।
కాలభీకరసాంపరాయక-కాలకాలసుసాయకా।
కాలనీరదకామనీయక-కాయజిత్సుమహాయకా।
శీలయుక్తఫలప్రదాయక-శీలవేంకటనాయకా॥ ౪౦౦॥

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యాన పరాయణ భూమ
ధైర్యవినయ రామనార్యతనయ పండితసేవాసముచ్చయ క్రో
త్తపల్లి లచ్చయ ప్రణీతంబైన దాశరథివిలాసం బను మహా
ప్రబంధంబునందు దృతీయాశ్వాసము.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# దాశరథివిలాసము.

## చతుర్థాశ్వాసము.




కాంతావరముఖనా।

శ్రీకాంతరమహితపుష్ప-లిట్కృతపీఠా।

నాకావాసాసహవమ।

హాకరిహార్యత్తు వేంక-టాద్ర్యధ్యక్షా॥

వ. దేవా తదనంతర కథావిధానంబవధరింపు మట్లుభరతుండు ధర్మ
నిరతుండై నందిగ్రామంబున నివసించెనని చెప్పి యప్పట్టపుట్టువుఁ
దపసి వెండియునిట్లనియె. ౨॥

ఉ. తమ్మునిఁగాంచి రాముఁడుసు-ధారసతుల్యములైనవాక్కు కా
యమ్ములనిట్లువంక్రమున- మన్యవనంబునకేగఁజేవితా।
లమ్మగుపర్ణవేశ్మమున-లక్ష్మణనిర్మితమైనఁదాసమీ।
పమ్మగుటాత్మనెంచిమన-పజ్జకునబ్భరతుండుగ్రమ్మఱన్॥ ౩॥

క. వచ్చుచుఁబోవుమనుజుల।
స్వచ్ఛతవిఘ్నంబువిపినవాసంబునకే।
వచ్చుపడందల్పితినిఁక।
నిచ్చోఁబోఁడంచుఁజనఁదవలి· కేగనయొప్పన్॥ ౪॥

వ. అనిపలికి సీతాలక్ష్మణసమేతుండై చిత్రకూటంబు వెనలి చనిముందట.

సీ. ఘనలతాతన్వులు-గౌఁగిలించికొనమి,
న్నఁగదిరుగు పెద్దపులిట-షావలియును।
పాషాణకంటక-బహుళంబులైరార,
భభయంకరములైన-వర్త్మములును।
జీర్ణపర్ణములలో-జిటచిట ధ్వనులతోఁ,
గుసుకఁబట్టులు వాలు-గోధికలును।
దరుకోటరాంతర-స్థఫణిఫణామణి,
వాత్రితఘృణివ్యల్ప్త-జాతములును।

గీ. సామజవ్యాఘ్రభల్లూక-శరభములును।
గలిగిభీకరమగు దానిఁగనె సురశ।
రణ్యమగునొక్క-దుర్గమా-రణ్యమంత।
సన్నుతజనమూర్తి రామరా-జన్యమూర్తి। ౬

వ. ఇట్లు కనుంగొని. ౭॥

శా. వన్యేభోగ్రకులాయసింహశరభ-వ్యాఘ్రర్క్షభల్లాదికా।
ధ్వన్యాభీలమృగావలీభయదకృ-ద్ధన్యాధికాకంపితా।
వన్యాత్మోద్భవసాధ్వసాపనయన-వ్యాసంగుఁడై యాత్తశౌ।
జన్యారావము రాముఁడుపలా-శిస్తోమభీమంబుగన్॥ ౮

వ. నిజధనుష్టంకారఘోషంబున వనమృగంబులెవ్వియుం దమ్ముఁజేర కపాయునట్లుఁగావించుచు వివిధఫలమధుర మధురసంబుల నవని జకుందృప్తిసేయుచు నయ్యాయిలతాకుంజపుంజంబులం జూపుచుం జనునవసరమ్మున లక్ష్మణుండన్నం గనుంగొని॥ ౯॥

ఉ. సారసులోచనాఁదికొని-చంచలభావముకింతలేకని।
స్తారశిఖాచ్ఛటల్ జటల-చందమునొందఁగ వల్కలంబులం।
జీరలుగాఁగ నాకులని-శీర్ణతనొందఁగ రామచంద్రుడు।
ర్వారతపోభరంబితుల-రణ్యముగీక్రియఁదాల్చెఁ జూచితే॥ ౧౦॥

వ. అనుటయు మహానందంబు నొందుచుం జనిచని॥ ౧౧॥

సీ. ఆఖుశాబకకేలి హానపానూడికా,
వర్తితపటుతర-గర్తములును।
వాతాయమానవ-వ్రాతఘోరవ్యాఘ్ర,
కులసమాకీర్ణవి-కుంజములును।
మృగరిపుప్రకరగం-ధగజేంద్రసంఘాత,
దంతురితగిరిగు-హాంతరములు।
భీతికృద్ఘూకవా-రాతశుకశారి,
కాటవంచితతరు-కోటరములు।

గీ. శ్యేనజాలకపోతసం-శ్రితమహావి,
శాలమహనీయబదర-సాలములును।
గలిగి విదళితఘనపథి-కనియమిజన।
తాశ్రమంబగునొక తాప-సాశ్రమంబు॥ ౧౨॥

వ. కనుంగొని యప్పుణ్యాశ్రమంబుఁ బ్రవేశించియందు॥ ౧౩॥

క. అనసూయాహృదయేశ్వరు।
ననసూయాహృదయకమలు-నత్రిమునీంద్రుం।
గనితత్పదంబులకు వం।
దనమొనరించుటయు నద్భు-తప్రమదమునన్॥ ౧౪॥

క. దీవించి రాముఁగని ముని।
భావంబలరారనర్ఘ్య-పాద్యంబులసం।
భావించియంతరయమున।
భావభవనిభుసుమిత్ర-పట్టిని మిగులన్॥ ౧౫॥

వ. సముచితసత్కారంబుల మనఃప్రియంబు గావించి రామలక్ష్మణులం బవిత్రకుశాస్తరణంబుల నాసీనులం జేసి కుశలం బడిగి తానును సముచితాసీనుండై మధురసంభాషణమ్ములం దేల్చుచున్న యవసరంబున।

మ. అనసూయాచరణారవిందములక-త్యంతానురాగంబుగాఁ।
దాసీమంతగతోల్లసద్ఘుసృణముం-దాఁకించి చేదోయివో।

య్యన జోడించి వినమస్కరించుటయును-యయ్యత్రేయి ధాత్రీసుతా।
వాజాతాయత నేత్ర నెత్తికొనియె-వాత్సల్యసంపూర్ణయై॥ ౧౭॥

వ. ఇష్టాశీర్వచనపూర్వకంబుగా నెత్తికొని నిజవిశాలపర్ణశాలామధ్యం
బున సుఖాసీన నజ్జానకి నుద్దేశించి॥ ౧౮॥

చ. సుఖములరోసి కాననవ-సుంధరకుం బితృవాజ్ఞ నేగుదెం।
చిఖరకరాతపంబునఁ గృ-శించె నుభర్తృపిఱుంద నవ్వన।
స్సుఖము దలిర్ప నుండెదవు-ముక్తభయస్థితి నైపతివ్రతా।
త్వఖనిక నీవు నీకసరి-వత్తురియుత్తసుమత్తకాశినుల్॥ ౧౯॥

వ. అనిమఱియు ననేకవిధంబులం బొగడి॥ ౨౦॥

గీ. అభిరామకము సుభగ-తాభివృద్ధి।
యగునిది ధరించువారల కని చించి।
కంబుకంఠికిఁ గంగరా-గంబు సంగ।
నత్తపస్వినియనురాగ-మతిశయిల్ల॥ ౨౧॥

ఉ. ఈకరణిన్ మునీంద్రసతి-యిచ్చినరంగునఁ గాంగము౦।
బ్రాకటలీలఁ దాల్చి కడుఁ-బ్రార్థన సేయఁగ నామె తోడ ని।
ర్భీకుఁడు రామమూర్తి దను-బెండిలియైనచరిత్ర మెల్లసీ।
తాకులకామినీమణి ముదంబునఁ దెల్పి యనంతరంబునన్॥ ౨౨॥

సీ. అత్రిభార్యకు విన-యంబునఁ బ్రణమిల్లి,
కులసతీధర్మము-లొక్కొక్క మిగుల।
విన నాసచేసిన-విని పింపుమనవుఁడు,
నయ్యవనీజాత-కాదరమున।
భర్తమాటకుమాఱు-పల్కుటతలవాకి,
టమెలంగుటయుఁ బాయ-సుమనోకర్తు।
సేవించుటయు ముని పిదముల్భర్తకు,
రూపిరైనవారిస్వ-రూపిఁగాఁగ।

గీ. మదినిరూపింపమిక దుదు-ర్మార్గమగుట।
పాత్రరంబుగ నాత్మథ-యాత్తయగుట।

క. కంతుని దెగఁ గనుఁ గొనుమతి।
కుంఠితుఁడై పోఁడు నేలఁ-గూలెడు వెడసో।
తక్కుఁ దులగుచు నిలకుఁ జికిరి
కఁ(శీ)రవము ల్గిరిండి-గను అకుకరణిక్॥ ౪౦॥

వ. ఇట్లు లంఘించి జానకిభయంబు వాపి యుల్లసిల్లి రంత॥ ౪౧॥

గీ. రాము బాణనిహతిఁ గంధ-రంబు డస్సి।
యక్షణము రామలక్ష్మణు-లబ్బురపడ।
శాపమోక్షంబుఁ గాంచి ని-శాచరుండ।
గర్వఁ దగు తుంబురాఖ్య గం-ధర్వుఁ డగుచు॥ ౪౨॥

ఉ. చెంతకు వచ్చి రామనృప-శేఖరుఁ గాంచి నుతించు మున్ను తొ।
దంతము నంతయుం దెలిపి-తత్పతి వీడ్కొని యాక్షణంబ ని।
శ్చింతమనస్కుఁడై ఖచర-సింహుఁడు వోయిన మానవేంద్రుఁ డ।
త్యంతసవిస్మయాత్ములగు-నట్టి ధరాతనుజానుజాత్ముఁడై॥ ౪౩॥

క. అరిగి భయంకరవనములఁ।
దిరిగి తిరిగి యమితకీర్తి-దిక్కృతగంగా।
శరభంగు విశరభంగుని।
శరభంగగహితుఁడు రామ-చంద్రుఁడు గనియెన్॥ ౪౪॥

క. కనితచ్ఛరభంగపదా।
బ్జనికటతలఘటితఫాల-భాగుండైయు।
మ్మునిపతి నుతింప నతఁడు।
మ్మనుజేశ్వరు నెత్తి మిగుల-మన్నన యొసఁగెన్॥ ౪౫॥

వ. గాఢాదరపూర్వకంబుగాఁ గౌఁగిలించి కొని యనంతరంబ మొక్కి నిలిచియున్న ధరిత్రీపుత్రీసుమిత్రాపుత్రులం దగు భంగి సంభావించి యమ్మహామహులకు నర్ఘ్యపాద్యంబు లొసంగి మధురంబులగు కందమూలఫలంబుల నాతిథ్యంబు నడిపి సుఖోపవిష్టుం డగు శ్రీరాముం గనుంగొని శరభంగుండు. ౪౬॥

చ. ఘనబలభేదినాకభువ-నంబునకుం బిలువంగ వచ్చిన
న్ననుమతిపోక నిన్నుఁ గను-వేడుక నిల్చితిఁ జూడఁ గాంచితి
న్మనుజవరేణ్య నీవలర-మాఘవివార్యజనాదరుండవున్
ఘనత నెసంగు నీకరుణ-గాంచిన వారికిఁ గ్రాతె సౌఖ్యముల్ ॥౪౭॥

క. త్రిదశజగన్నివసనమజ
పవవాసంబును ద్వదీయ-పదదర్శనసం
పదకు నదృష్టంబు లెతల
పదశరధతనూజభూమి-పదయామూర్తీ ॥ ౪౮॥

వ. అనిమఱియుం బ్రస్తుతించి॥

క. అలరుం దే వెలఫలముల
వలరులనజినోత్తరీయ-వాదులనలరా
నలరు చిరములగు దలిరుల
నలరులసద్భృదయుండగుచు-నమ్ముని రాముసఁగనె ॥ ౪౯॥

వ. పరితుష్టుండై యమ్మహాత్ముఁడీడ్కొని. ౫౦॥

క. సాలంబులు నరుణరుచిక
సాలంబులు గిరసంత-సాలంబులు వా
చాలమ్ములగు విశమ్ముల
జాలమ్ములు గలిగి కడువి-శాలమ్మగుచు న్ ॥ ౫౧॥

సీ. అళితారకాప్రవా-ళలతాకదంబవి,
స్తారమై హరికులా-ధారమగుచు
వరభూరి ఫేనరై-యూరుచంద్రకిరణాను,
కూలమై మహితవి-శాలమగుచు
మహనీయ గండక-మదజలమాతంగ,
ధామమై రాజీవ-ధామమగుచు
వరరాశి కెనయగు-వనరాశిఁ గనుఁగొని,
రాఘవుండనుజగో-త్రాసుతా స

గీ. కేతుఁడైచనిసద్గుణో-పేతుఁగనిరి।
వయ్యరణ్యాంతరంబున-నధికనిష్ఠఁ।
దపమొనర్పుచుహోత్రుశాం-తవిమలాత్ముఁ।
దీక్ష్ణకరకోటిధాముసు-తీక్ష్ణనాము॥ ౫౨॥

గీ. కాంచియాతనిమన్నన-ల్గాంచిసన్ను।
తించియమ్మౌనియాజ్ఞవ-హించిమించి।
తన్నుఁబ్రార్థించుమునులయు-త్తమతపోవ।
నంబులనుజూడఁబోయెన-యంబుమీఱ॥ ౫౩॥

వ. అరిగి ప్రియానుజ ప్రియాసహితుండగు నారాఘవుండు॥ ౫౪॥

సీ. మునికుమారులకుఁగ-మ్మనిఫలంబులుదెచ్చి,
యొసఁగిలాలించుచు నొక్కచోట।
పారికాంక్షులతపో-భవనాంతికంబుల।
నుటజములుగట్టుచు-నొక్కచోట।
వాచంయమికథిత-వరపుణ్యకరకథ,
లూఁకొనియలరుచు-నొక్కచోట।
తాపసులకునుప-ద్రవములుగావించు,
రక్కసులనుద్రుంచు-చొక్కచోట।

గీ. ఋషివరేణ్యులకజినో-త్తరీయకాదు।
లొసఁగిదీవనలనుగొంచు-నొక్కచోట।
నొప్పుమునిమాన్యనలుగొంచు-నొక్కచోట।
రాముఁడుచరించెసుగుణాభి-రతుఁడుమఱియు॥ ౫౫॥

క. మునిజనఘనహితవర్తన।
మునఁగొన్నిదినంబులచట-మోదించుచురా।
మనరేంద్రుఁడువారలవీ।
డ్కొనితిరుగఁదిమంగళకర్ణి ఘోరతపంబుల్॥ ౫౬॥

వ. కావించునప్పుణ్యాశ్రమ సమీపంబున నరుగునవసరమున॥ ౫౭॥

సీ. సితపీతకాంతులఁ-జెన్నొందిపథికుల,
కలిమాత్ర కామోద-మావహింప।
శోకపైకాశ్రయ-శాఖానిరంతర,
చ్ఛాయమై వలపులు-సందడింప।
మృదుశిఖాకర్బుర-మేచకకేకావి,
నీలపింఛంబయి-నెమ్మిఁగింప।
నిజరసోల్లాసిత ద్విజవిసరంబయి,
యింపుమీఱెసురుచు-ల్వెంటరాము।
గీ. వామపార్శ్వంబునఁ సుమా-వళుల నేలు।
బాలసహకారషండంబు-పజ్జకేగుఁ।
గాంతమాయూరవరనాట-కంబుఁ గాంచుఁ।
గొష్టపందులుగోయున-కోర్కెనయందు॥ ౫౭॥
వ. ఇవ్విధంబున ముదంబునొందుచు, శ్రమంబున గుందుచు, తలంకుచు వడఁకుచు వెతవెత నడుగిడు పుడమిపట్టిం గనుంగొని రాముండు. ౫౮॥
క. యాసముఖితరువిసరమా।
యాసము రానేలవలవ-దడవిక మునుఁజా।
యాసముచితముగ మున్నద।
యా సమధికవృత్తిఁ దెల్ప-నదివినవుకటా॥ ౬౦॥
క. లాయమ్ములురిపుజనవిపు।
లాయమ్ములు సంతతవిపు-లాయమ్ములు వా।
లాయమ్ములుమునకిపుడులు।
లాయమ్ములుభయదఖగకు-లాయములయ్యెన్॥ ౬౧॥
క. కాంతారమ్ములనుచుతర।
కాంతారమ్ములఁజరింపఁ-గానోపుదెస।
కాంతారమ్ములనులికెదు।
కాంతారమ్మునను విభుఁడు-గాఁగిటఁ జేర్చెన్॥ ౬౨॥

వ. ఇట్లు బహువిధోపలాలనంబుల వలతిం చుచుండు వంత నయ్యన్నద
మ్ములు దుర్గమారణ్యమార్గంబుల నప్రమాదులై చని చని రొ
క్క-ఠాఁడు. ౬౩

ఉ. రాసుతులర్క-వంశవన-రాశిసుధాకరులెంతయేనిసం|
త్రాసముఁనర్క-వంశవన-రాశిసుధాకరమైనశోవధా|
త్రీసుతఁ గూడి చొచ్చి విహ-రించిరి రాముఁడు లక్ష్మణుండున|
జ్ఞాసనకృత్యమేరితర-మానుగఁడంగితొలంగఁ బెట్టఁగన్|| ౬౪||

వ అది మఱియును బ్రవేఢ్దాశ్వద్రప్రవృద్ధకపిత్థవటాశోక దాడిమీ
తరుసంభృతంబును పారిజాతకామ్రాతకశ్లేష్మాతకపిండీతవిభీతక
కేతకీభల్లాతకీ జంబూ జంబీరోదుంబరనింబభూనింబకదంబ కదం
బ భూమిజంబుకావ్యతంబక కాకోదుంబరి కాంబుజభూమిజంబు
కామముఖానోకహ సంకులంబును శితిసారక హంసమారక కుమా
రక కలికారకవనమయూరకసాల రసాల తమాలకృతమాలతూల
తాలహింతాల నారికేలభండీలాంకోలకుద్దాలనక్తమాల సాలవి
శాలంబునుంగలిగి త్రివిష్టపంబు విధంబున రంభాసురభ్యైరావత
మందారేంద్ర సురసామ్యతాన్వితంబై ప్రధనధరాత్రిమంబున
కుంభిస్యందనవీరతరుధమత్ప్రాణాంచితంబయి నభోమార్గంబు
చందంబున తరణివసుమనోహారంబయి యధోభువనంబుకైవడిన
నంతాశ్రయంబయి సత్యలోకంబుప్రకారంబునఁ బ్రహ్మణ్యశార
దాగాయత్రీసముపేతంబయి జటిసమూహంబువడువునఁ జటీకా
శికశాండిల్యలోమశకపిలానుకూలంబయి కైలాసంబు పోలిక
పాశుపతహైమవతీశివాధికంబయి, బలిసద్మంబునకువున్, కితవ
పలాశరాక్షసీ సంయుతంబయి యభయాధికంబయ్యును గు
ర్వురా లర్కభయానకంబయి ఋక్షపున్నాగ మయూరారి
ష్ట వ్యాఘ్రనఖసమన్వితంబయ్యును ఋక్ష పున్నాగమయూరా
రిష్ట వ్యాఘ్రనఖసమన్వితంబయి నాగవల్లీలవలీలతా బహుసుతా
త్రివృతా ద్రాక్షాలతా బహులతాభిరామంబయి యొప్పుయ్య

రణ్యంబునం దట్లు ప్రవేశించి పెంటుల నెదుటఁ బెట్టికొని మెట్టకో
ట్టగొనలం బురులు విప్పి యాడునట్టి నట్టువపిట్టతిట్టలం గాంచి హర్షో
త్కర్షంబునొందుచు నొకొక్కకపట్టునం బుట్టలనిక్కి నిక్కి దిక్కు
లు చూచు గోధేరంబులం బట్టికొన శంకించు శబరశాబకులం జుట్టి
కొని పోవు పైపోవు సారమేయంబులకు దూరంబుగాఁ దొలంగుచు,
బండిగురివిందతీవచప్పరంబుల నీడలం బండి విశ్రమించుచుం బండి
నకంటకఫలంబుల ఫలంబు లుపయోగించుచు, స్కంధాగ్రంబు
లను ముస్నిగ సితదనంతరంబున న్నిసువులకు నిజలాంగూలదండం
బు లూతలుగానొసంగి యెక్కించుకొని శాఖాగ్రంబులం దము
కు శాఖామృగంబుల సహాయంబపేక్షించుచు, నకులంబులు లేలిహాన
కులంబుల విదళించు నేర్పునకుం బొంగుచు, భుజంగసమాలిం
గితమ్ములగు ద్రుమమ్ముల కొమ్మలు భుజంగాలింగితలగు కొమ్మలం
బోల్పఁ బట్టగు ప్రదేశంబులం దిరుగుచు, ననేకవిధ మార్గాల
జాలంబుల నాలోకించుచు, సారంబులగు కృష్ణసారంబుల
సారంబు తీరంబులం జాలు నారయంబు లాలించి, ఘోర క్రూ
ర మృగంబులుగా శంకించి పరికించుచు, కమలాకర తీరమ
హీరుహాగ్రశకున నిపతితంబులగు ఫలంబులు జలంబుల బుడుంగు
బుడుంగున మునుగుచుం బడుచప్పుళ్ళు మెప్పొదవ నాలకించుచు, ను
త్తుంగంబులగు పర్వతశృంగంబులనుండి వెలువడి జలజలఁ బ్రవ
హించు శైలయేళ్ళ ననుకరించు పూదేనెవాకల సమీపంబుల నిల
చుచు, వింతలగు కమ్మతావులు వెదజల్లు కపురంపు టనంటి బోడియ
లవాసనఁ గొనిపోవుచు, రెపకడన మేల్కని యొరలు వెట్టి పిల్లల నెఱ
కలనితికొని యొదిగినదురించు కాయకొడిపిట్టలం బిట్టులికించు
చు, సర్పవృశ్చికంబులకు వెఱవక వెరవున వెలుతురునకై వత్తి వ్రో
టంగఱచిపట్టికొని యల్పవిశాలంబులగు గిరిబిలంబులందూఱి చని
యందు నిదురించు నేదుపందులం గదకొల్పువట్టికొని వెఱకేడ్చి
కొనివచ్చు నిషాదుల సాహసంబున కచ్చెరువుగొందుమఁ, బథ

మ్మువఁదమ్ముఁ గాంచి భయమ్ముగ్రమ్మికొన రయమ్మునం బారుతై పొలుశశకాది క్షుద్రజంతునికరమ్ముఁ గరమ్ముఁ గనికరమ్మునం జోవిడుచు మృగయాపరిక్షిప్తవిషాక్తపృషత్కంబులు మనుబోతులఁ గ్రుచ్చికొనియుచ్చి చనిన వేగంబునం గాడినవాడిఁన జోకలగు మావిమొకల నాలోకించి యాకులంబునొందుచు మఱియుఁ గొన్ని సంకటస్థలంబులం బాదంబులందీవలల్లికొనినం బోఁజాలక మిట్టిమిట్టిపడుకఱుతుల సమీపంబునకుం బోయి బంధమోక్షంబు గావించుచు నాశ్రమంబులగు తాపసాశ్రమంబులచెంతం గాసారంబుల తీరంబులం బర్ణశాలలు విశాలంబులుగా నిర్మించికొని వశించుచు, వల్మీకబిలంబులవెలువడి దీర్ఘజిహ్వాపల్లవంబులు సాచి చిఱుచీములం జవిచూచుచు నలుకువొదవ మిన్నంజుట్టుచుట్టికొని వెలికింజిప్పల పోవుగన్పట్టఁగొంతవడికి భయంబుదీఱిన నెప్పటియట్లతిరుగ నారంభించు నాలువల నాలోకించుచు, వివిధమధుమధుర ఫలపలంబుల నాకలివుచ్చుచుఁ, బువు రాల్చునతరుషండంబు తారకాంచితంబగు నాకాశంబుచందంబు గావితర్కించుచుఁ గంఠీరవంబులకుం భీతోత్క్రాంతంబునఁ గుంభికుంభస్థలంబులు వగులించిన వందల్రక్తముత్యంబులు రాలుటగా నెఱింగి బదరీఫలభ్రమ దట్టంబులకు పత్రపుట్టికలం బెట్టుచు, కటపాగ్రంబులసమాంసమ్ములగు నెమ్ములుఁగనుంగొని చిఱుతపులులల్పమ్మాగంబులం బట్టి యచటఁ బెట్టికొని భక్షించుటగా నూహించుచుఁ దరుశిఖరకులాయపరనిక్షిప్తనిజాండద్రవనోదితకృష్ణసర్పసమాలోకనజనిత మహాశోకరోషవేగపరిభ్రమితపక్షులార్తనాదంబులకుఁ గనికరించుచు, మచ్చికలప్పడంబెచ్చువెఱిఁగి పచ్చిపట్టులకువచ్చి మొచ్చివిచ్చలవిడి మేయుచున్న సారంగంబు చరమాంగంబు లధిష్ఠించి తత్పూర్వ స్పర్శనంబునస్నేఁది కాగయు శలభ విసరంబుల సరభసంబునం బట్టికొని క్రమంగ్రమ్మఱ నెప్పటియట్ల శేకఫ యూఁపులం బాగంబులు మోపి యుల్లసిల్లు భరద్వాజంబుల నభివీక్షించుచు, నిలువిల్లం జ

లిచీమలుగఱచిపట్టినం దాళఁజాలక తరులతాగుల్మంబులు సొల్వ డంగొట్టికొను మెట్టపొట్టపింజరుల యుపద్రవంబులు దప్పించి కొని పోవుచు నార్ద్రప్రదేశంబుల విహరించియుం బుష్పరసం బులు పుక్కిలులంబట్టియు వచ్చుచుంబోవుచున్న జుంటీఁగలవెను వెంటందప్పకచని క్షుద్రపటలనిష్కుహమ్ములగువనోకహమ్ములం గ నుంగొని తన్నిమిత్తసమాయాతభల్లూకవ్రాతంబులందోలి తద్గర్భమ్ము లంగరమ్ముఁజొను పుటకుఁగరమ్మునిడి కటమ్మై వశమ్ముగాకున్నం గొన గోళ్ళవవియించి తాలుమధుధారలం దోయిళులంబట్టి త్రావియుం దనివిసనక జాలితెనెతెయులం జేతులువణపి మధుకోశంబులందీసియొసం గినంబొట్లంబులుగట్టు నెడనెయుంగకచిన్నిపూఁదేనెపొరలంబురువు లతుట్టెలనిపారవైచుచిన్నవారలంజూచి నగుచు మరల నేరించుచెం చునాయకులవింతమాటలకుసంతోషంబునొందుచు ఫణిఫణామణి తోరణ విశాలపాలసౌధాంతరజ్యోతిరింగణదీపికాదీపితమృదుగు ళుచ్ఛ సుమలతాకాయమాన మత్స్యప్రదేశ మకరందపరిక్షాళిత శి లాతలాసీనభిల్ల పల్లవాధరీ వినోదమధుర వేణునాదంబులకుఁగరం గుచు నిజతంతుసంతానంబుల గుల్మాంతరమ్ములు నిరంతరమ్ములుగా గప్పటాకారంబున నేర్పునల్లినానిం దగుల్కొనిచిక్కినకీటకం బుల దంశంబు లుపదంశంబులుగా భక్షించు నూర్ణనాభంబుల యాలోచనంబులకుఁ దలలూఁచుచు తేఁకుల సందడిం జెదరిపో యినసమయంబునఁ బొంచిచని కోతుల్పెలు సలుఁగులంబట్టికొని పాయునెడ నిజశాఖకంబులొరించు నార్తిఁదెలుపుఘీంకారంబు లాలించి గ్రక్కునం గలసికొని వ్యాఘ్రంబులనిగ్రహించి పిల్ల లగుమింగలసికొని పొదల సంతసంబునం బొదలుచు ఘుర్ఘు రధ్వానంబులం బుడమి వ్రక్కలించికొని యొక్క పోత్రివు గా నిదురఁజొక్కియున్న స్తబ్ధరోమంబులం దెలుపుచు శుష్కవంశాన్యోన్య సంఘట్టనోద్భూతప్రభూతవనహుతాశనజ్వా

లాకలాపంబులను సహాయంబైన మధ్యాహ్న సమయోష్ణకిరణో
ష్ణాసహిష్ణువులై మడువులంబడిపొరలు సైరిభంబులనిభంబులుగా
నభివీక్షించుచు, మృతమృగకళేబరదుర్గంధగర్తవర్తనధూర్తమృగ
ధూర్తసమాఘ్రాతంబులకు రోయుచు, చమరీమృగవాలవ్యజన
వీజనోజ్జనిత మరుచ్చేల్లితాలతాంతడోలికాసంస్థితంబులగు మిళిం
దబృందఝంకారంబులకు వినోదంబునొందుచు, వనశునకంబులు
వెనుకొనంగను కనిం బాతి యచ్చారిందోలంగఁ దమ్మునేరిన రు
రువారంబులం గటాక్షించి తద్విరోధంబు లగు జంతువుల వద
లించుచు, మనోహరవిపరీత భయానకంబులకుఁ దానకంబులగు
ఖగమృగస్వనంబు లాకర్ణించుచు, నిరోధిత తరణికిరణప్రసరణ
తరులతాశిఖర పరిపక్వఫలప్రతిబింబిత తారకాకోరకప్రకరంబు
నుంబోని ఫణిఫణామణిప్రభాపటల ధగద్ధగితంబున కచ్చెరువునం
దుచు, వనేందిరాకిసలయహస్త పరిస్రస్త ముక్తాఫలక్రమాభివీక్షిత
బాలతృణాంకురాగ్రమాలికా ప్రతిభాసిత హిమానీబిందుసందో
హంబుఁగొనియాడుచు, సిందూరంబఁడిన దొండపండులదండం
దండిగఁ జెక్కిన జిగురుం గండెలం దండోపతండంబులుగా
బెండువడి పడిన పీలిపిట్టలం బట్టికొని మెచ్చువచ్చు కు
చ్చులం బుచ్చుకొను శకునాంతకుల చెంతకుం బోవుచు,
దివాచర నిశాచర మృగపక్షి ప్రచరణంబువలనను గమలకైరవ
వికసనోన్మీలనంబువలనను ప్రభాకరోదయకాలాస్తమయ కాలని
రూపణంబు గావించుచు మెట్టయుదుటిపిల్లలంబట్టి విడుచుచుశా
ర్దూలంబులం దోలుచు తరక్షువులశిక్షింపుచు శరభంబులసరిపెట్టు
చు గవయంబులంగడతేర్చుచుఁ గణుదురులకుం దొలంగుచు వా
డిగలముండ్లు గాడినం దూఁగాడుచు నన్యోన్యదైన్య సంతోషణం
బులగు సంభాషణంబులాడుచు వర్షాతపహిమానీ నివారణంబుగా
గుజ్జుమావులపజ్జకుం బోవుచు గుసుమవిసరంబులేయుచు నీరంబులం

దూఱుముఁ గొంతదూరంబుచనిచని యొక్కనాఁడొక్క పుణ్యా
శ్రమంబుఁ గనుంగొని యుండు. ౬౫

మ. భవవారణ్యభవప్రతీతసుగుణభ్రాజిష్ణు వింధ్యాదు।
ర్భవనాగారిఖగాధిపున్నియమిసంభావ్యప్రభావాఢ్యునిన్।
భువనాంఘ్ర్యనిమాత్రివమ్ముళికితాంభోరాశినత్కుంభసం।
భవనాముంజగదేకవంద్యఘనులోపాముద్రప్రాణేశ్వరున్ ॥ ౬౬ ॥

క. కని మ్రొక్కిన సీతారా।
ముని గ్రక్కున గ్రుచ్చియెత్తి ముని మక్కువ నె।
క్కొనకన్నన కన్నఁగ దియు।
సును దెక్కలు నొక్కి కడుమనోమోదమునన్ ॥ ౬౭ ॥

ఉ. అంబుజమిత్రగోత్రకలశాంబుధిసోముని రాముని బ్రమో।
దంబునఁ గన్న పుత్త్రశవిధంబున నెంతయు నాదరమ్మునా।
పంబువహించె నోయనఁ గృపన్ముని దేల్చెను ఖానసార్ఘ్యపా।
ద్యంబుల నిష్టవాక్ప్రచయమ్ముల నిట్లలరించి వెండియున్ ॥ ౬౮ ॥

క. లక్ష్మణుఁ గృతలక్షణుఁ ఘన।
లక్ష్మణు మన్నించి తనకు లసతి యని చెనా।
లక్ష్మీసమానయగు జన।
కక్ష్మాధీశసుతఁ బూజఁ గావింపఁగన్ ॥ ౬౯ ॥

వ. నిరూపించి రామలక్ష్మణుల నుచితాసన సమాసీనులం గావించి మధుర వచనరచనల నలరించి రాముం గనుంగొని. ౭౦ ॥

ఉ. కాయము వొంగ నిన్నుఁ బొడఁగాంచితి ధన్యతనైతి నాదినా।
రాయణమూర్తి వీవు మునిరక్షణకై యిటు లుద్భవించినా।
వాయువనీతనూజభవదంగనపంకరుహాక్షి లక్ష్మి నా।
నీయనుజుండు లక్ష్మణుఁడు నిక్కము శేషఫణీంద్రుఁ డారయన్ ॥

చ. త్రిదశవిపద్దశాహృతిగురించి విరించి స్మరించి చిన్ ధరి।
త్రిదశరథోర్వరావరస తీత్రయమందుఁ జతుర్వరాకృతు।

ల్తుదమునఁ దాల్చిపుట్టితివ-మోఘమునిష్ణుఁడవీవుతావక।
ప్రదరనిపాతితంబులగు-రాక్షససైన్యములోకభద్రవేల్మిడిక్ ౭౨॥

వ. అని యభినందించి మఱియుం బుణ్యకథా విశేషంబు లుపన్యసించుచు నిట్లుండ నగస్త్యుండొక్కనాఁడు రఘుపుంగవుం గనుంగొని నీ వింక నిందుండవలవదు గౌతమీతటంబున నుత్కటంబగు పంచవటంబు గలదచట నుటజంబు నిర్మించికొని జానకీలక్ష్మణ సమేతుండవై యప్రమాదంబున నుండునది యని చెప్పి రాఘవునకమోఘశిలీముఖంబులొసంగి యాదరాతిశయంబున. ౭౩॥

క. హస్త్యయుతతయునివరుణఁగ।
భస్త్యాప్యయుతుని రామ-భద్రునిఁ గరుణ౯।
న్నస్త్రధికంబగునటులన।
గస్త్యుఁడుదీవించెఁ గౌతు-కంబలరారన్॥ ౭౪॥

వ. దీవించినం బరమానందంబునొంది రామచంద్రుండు మునిచంద్రుం గనుంగొని. ౭౫॥

క. వింధ్యమువణఁచితిబలపరి।
పంధ్యభ్యర్థితుఁడవగుచుఁ-జాణితలమునం।
గంధ్యుదకమ్ముం ద్రావితి।
వంధ్యతపోవిభవపొగడ-వశమేనిన్నున్॥ ౭౬॥

వ అనియిట్లు ప్రత్యభినందనపూర్వకంబుగా వీడ్కొని, ౭౭॥

క. పాలసురసాలపణసత।
మాలవకుళపూగనక్త-మాలసదవిపీ।
శాలముగువనంబునవీ।
శాలక్ష్మణసహితుఁడైము-దంబునవరిగన్॥ ౭౮॥

గీ. ఇవ్విధంబునవరిగిమ-దేభసింహ।
శరభశార్దూలభల్లూక-సైరిభతతి।
గలిగికాకఘూకారవా-క్రాంతమగుమ।
హావనంబులవిహరించు-నవసరమున॥ ౭౯॥

సీ. పటుముఖతరుశిఖా-చ్ఛటలఁగనుంగొని,
యవిక్రూరసర్పంబు-లేయటంచు।
గుమ్మఁబర్వులవాలు-క్రోడంబులనుగనుం,
గొనియవిగజములౌ-కోయటంచు।
వావిరిమెలఁగుశి-ఖావలంబులఁగని,
యవిపెనుభూతంబు-లేయటంచు।
వీచికాసదృశమ-రీచికల్గనుఁగొని,
యవిదీర్ఘదీర్ఘిక-లేయటంచుఁ।

గీ. దరలతాగ్రిక్షాదివల్లివి-తానసంచ।
రల్లలితపింఛధమ్మిల్ల-భిల్లపల్లి।
వాధరులఁగాంచిమునికన్నె-లాయటంచు।
నడుగునడుగద్గునకుఁదన్ను-బడమిజాత॥ ౨౦॥

వ. వెండియు. ౨౧॥

చ. వికచసరోజగంధిపృథి-వీసుతరామునికేలువట్టిక౦।
టకతరుదుష్టసత్త్వనిక-టంబిచటంజరియింపనేలరో౦।
డొకభయశూన్యమైనయెడ-కోయ్యనసేగుటయుక్తమంచుదు-।
రకుధరపఙ్క్తిఁజూపుఁగడు-రమ్యములంచుదలంచిమార్గరౌ॥ ౨౨॥

వ. ఇట్లిట్లుంగల పల్కుజానకిం గనుంగొని కాండోకవిషాదంబుగ దరిన న్మార్గంబునందోపనీక మఱుమాటల నిట్లనియె. ౨౩॥

క. కాలవశతనివురించిన।
గాలవశతములనువేదఁ-గనుఁగొనువైదే।
హీలతలువాలిచెవైదే
హీలతితలతొంగిచూడు-మింపొందంగన్॥ ౨౪॥

ఉత్సాహ.

కొమ్మకొమ్మటంచునేర్చి-కొమ్మకొమ్మపండులుం।
గ్రుమ్మరించుచుంచులమిం చు-కొండచఱులజొన్నలుం।

న్నీతకిటువార్ధిసెమిగులం।
ఖాతకిరైయిదీనసేమి-ఫలమగుఁజనకున్ ॥ ౯౧॥

క. అనిఘాదుఃఖంబువమునిఁ।
గినమనముంద్రిప్పికొనియ-కృత్రిమభక్తిం।
దనుగొలిచిరావరేంద్రుఁడు।
జనకసుతాసహితుఁడగుచుఁ-జనిచనియంతన్ ॥ ౯౨॥

క. ఆయటవీస్థలమునసీ।
తాయువతిప్రియుఁడుభక్తి-తఱూర్గిఁఫణి।
స్నాయువుజటాయువున్నఖు।
రాయుధహృతఖలనిశాచ-రాయువుఁగనియెన్ ॥ ౯౩॥

వ. గనుంగొని. ౯౪॥

క. వెక్కసపుముక్కుతునియల।
ముక్కలుగావింపఁజాలు-ముక్కునెవరికిం।
జిక్కనిచిక్కనిచక్కని।
ఱెక్కలుఁగలయిప్పులుంగు-ఱేఁడెవఁడొక్కొ ॥ ౯౫॥

మ. అనిచర్చించుచుఁదత్సమీపమునఁగ-య్యాదాక్షన్యయాధ్యక్షుఁడో।
య్యనఁజేరంజనియాతఁడాత్మవిధమా-ద్యంతంబునుం దెల్పెమ్రి।
క్కినుతుశ్శ్రీనివఁదీవచెల్లెలఁగఁబ-క్షిశ్రేష్ఠువీడొక్కెప్పద।
య్యనధాత్రీతనయానుజాల్వాగడఁ-త్యంతానుమోదంబునన్ ॥

వ. వృక్షలతాకుంజ పుంజంబులం జెలంగు పక్షుల నీక్షించుచుం జనిచని. ౯౬॥

క. ధీయుతుఁడురాముఁడనుజసు।
తీయుతుఁడటఁగనియెఁబరమ-ధృతియుతమునిపా।
ధేయముకళకవకులగా।
ధేయముఁబంచవటసమభి ధేయము నెసటన్ ॥ ౯౭॥

వ. కనుంగొని లక్ష్మణుంగనుంగొని. ౯౮॥

మ. తపముల్సేసెదుసంయమీంద్రులకుశీ-తచ్ఛాయలంగూర్చువా।
తపముల్సంహరణంబొనర్చుఫలసం-తానంబులంగూర్చుఁబా।
దపముల్జూచితెధర్మమెల్లనువన-స్థంబయ్యెనిచ్చోఁబరం।
తపముఖ్యంబుగఁగొన్నివాసరములుద్యల్లీలవర్తింతము॥ ౧౦౦॥

వ. అనిమఱియును. ౧౦౧॥

క. తమ్మునిఁగనుఁగొనివాచి।
త్తమ్మధిక ప్రమదసంయమ-తమ్మయ్యెఁబవి।
క్రమ్ముగనొవరింపుముప।
క్రమ్ములనొక భవనమిచట-రమ్యముగాఁగన్॥ ౧౦౨॥

సీ. అనుటయునకుటిలుం-డాకుటిల్లొనరించి,
చూపినంతయుఁ-జోద్యమంది।
యతివిశాలంబు-నుజ్జ్వలత్పత్రల,
తాకల్పితంబునా-తపతుషార।
వర్షభయాపేత-వాసంబుసమతలం,
బగుటకుమోదించి-యాదరమునఁ।
దమ్మునిగాఢరా-గమ్మునఁగౌఁగిఁట,
లాలించితత్కుశ-లతకుమెచ్చి।

గీ. సీతతోఁగూడనందున-నించెఁదప్ప।
మాపమునకొక్కచోటసౌ-మిత్రియుల్ల।
ముల్లసిల్లుచునుండఁ-గొప్పటజంబుఁ।
గట్టికానియుండెరామభూ-కాంతుఁడలర॥ ౧౦౩॥

వ. ఇవ్విధంబున నివసించి సమస్తోపచారంబులు లక్ష్మణుండొనరింప సుఖంబుండి సమయసమంబులు పండ్రెండుఁగడపియుల్లావళిష్టంబగు నత్త్రియోదశవత్సరంబున దొక్కనాఁడు. ౧౦౪॥

మ. ధరణీనందనకుఁ ఫలంబులు సుమి-త్రానందనా తెమ్ము పా।
మ్మురయంబొరఁగరమ్మటంచుఁ బనుప-న్మోదంబునన్లక్ష్మణుం।
డురహింబూవులుఁ గాయలాకులును బం-డ్లుం గోయనక్కానవాం।
తరసీమన్వ్వహరించుచుండనతివి-స్తారాద్భుతాపాదియై॥ ౧౦౫॥

క. క్రతుభుగ్రిపునాశమున।
గ్రతరసితోద్వేలమొకఁ-కరవాలమవ।
క్రతరంబైతోఁచెశత।
క్రతుమాయాకలితమగుచు-గగనతలమునన్। ౧౦౬॥

వ. అంతరిక్షంబునం బరతెంచి సమక్షంబున నిలిచిన యులక్షితకాక్షే
యకంబునభివీక్షించి లక్ష్మణుండు దక్షిణహస్తంబునం బరిగ్రహిం
చి తత్తీక్ష్ణ పరిష్కారంబుగానప్పుడ॥ ౧౦౭॥

క. ధారాధరనిభములగుమ।
హీరుహములనలుకమాను-లేతెంచిధరి।
త్రీరమణపుత్త్రిభవదసి।
ధారాదళితములుసేయఁ-దగుసేతరులన్॥ ౧౦౮॥

వ. అనిపలికి వారించియమ్మునులారాజనందనునుద్దేశించి॥ ౧౦౯॥

మ. ఫలసంఘంబులు లేవు రావు ఖగము-ల్పత్రంబులుం భక్షణా।
ర్హలసత్కాంతులుగావు తావు సమహా-హ్యాళ్యాళికిన్ తావుబూ।
వులగుత్తుల్గవరావుమాత్రమునుఁదా-వుల్లేవు రాజేంద్రనీ।
వులసద్బాహుబలుండవివ్వేదుమఁ-బోత్రివుందున్మితూటాడుమీ॥

చ. అనవుఁడు రాజనందనుఁడ-హర్పతితేజుఁడు లక్ష్మణుండు చ|
య్యనఁదను హెచ్చరించెడుమ-హాత్ములకున్ముదమొప్పవంశవ।
ర్ధనమొనరించియందుయుధ-రప్రవిలిప్తకపోలు నింగ్రహా।
ణనిహతసత్కపాలునిమ-నప్రవతశీలునిదైత్యబాలునిన్॥ ౧౧౧॥

క. కనిమునిపుత్త్రికుఁజంపితి।
వనిభయకంపితశరీరుఁ-డైకడువేగం।

జనితశయన్నంగ నుఁగొని।
వినిపించెందవదుసర్వ-వృత్తాంతంబుల్॥ ౧౧౨॥

వ. వెండియు. ౧౧౩॥

క. నరవరయెఱుఁగక గుల్మాం।
తరితుండైతపము సేయు-తాపసవంశో।
త్తమునొక బాలకుభయద।
క్షురికాహతుఁ జేసినాఁడ-సుమ్మని పలుకన్॥ ౧౧౪॥

ఉ. విన్మసహోదరాదనుజ-వీరులఁ జంపి మునీంద్రరక్షసే।
యాన్నమింటువచ్చిదురి-తాత్ములఁ జంపక నిట్లుసాధువృ।
త్తిన్మనరైయెసమాధినిర-తిన్మదమొందు మనుష్యమానిశా।
లున్నెడ దివ్వ నేసికదు-లోపితకర్మలమైతిమక్కటా॥ ౧౧౫॥

వ అని యనేకవిధంబుల ననుజసహితుండై విచారంబునొందుచున్న యిన్నకేంద్రచంద్రుసమీపంబునకు మునీంద్రులరుగుదెంచి భవదనుజభుజాసిధారాదళితమస్తకుండగునతండు దనుజాంతు వీనింతు నుమాదుటయనఘుఁబని యతనికి మనస్తాపోపశమనంబులగు వాక్యంబులుదగుభంగి నుపన్యసించి యనంతరంబ సౌమిత్రిం బేర్కొని యిద్దురాత్ముండు ఖద్యుజ్జిహ్వ్వకు రావణసహోదరియగు శూర్పణఖయందుద్భవించినవాఁడని తదీయజన్మప్రకారంబుఁ దేటపడంబలికి మఱియును. ౧౧౬॥

ఉ. జంబుకుమారుఁ జంపితిని-జంబుకుమారకదీననీకుదో।
సంబుతలంచిచూడయావ-సంబుకులేదుముదంబునొందుమా।
త్రింబడ నేలసీతనివ-ధించితినంచుఁ దదీయవృత్తిస।
ర్వంబునుసీకెఱుంగగర్వ వంబుగనిప్పుడువిన్నవింపమే॥ ౧౧౭॥

క. అనిసమిషము సేయఁగఁదన।
జనకునిఁ జంపిన విరోధి-సమయింపఁగని।
ట్లొనరించెదుతపమితనిం।
దునుమాడిఁదీననీకు-దోసముగలదే॥ ౧౧౮॥

వ. అదియునుం గాక మదీయ ప్రేరితుండవై యొనరించుటం జేసి శా-
పంబునకు సంశయింపం బనిగలదే యని వాచంయమి ప్రకరంబు ని-
జాశ్రమంబులకుం జనియె నిట్లు మహాముని ప్రబోధితులై రామలక్ష్మ-
ణులు నిర్విచారులై యుండి రంత నొక్కదినంబున. ౧౧౯

క. శూర్పణఖ వచ్చి యటు పరి-
మార్పఁబడిన కొడుకుఁ జూచి-యారని వగతో
నేర్పఁగ నగ్గహనమ్మున-
నార్పులు బొబ్బలు సెలంగ-నాక్రందించెన్. ౧౨౦

వ. ఇట్లరణ్యరోదనంబు సేయుచు మృతుండగు సుతుం దలంచి.

శా. తంద్రింజంపినవానిఁ జంపుటకును-ద్యన్నిష్ఠ నిచ్చోఁ గడు
న్సాంద్రంబైన తపంబు సేయు నిను నే వీకుం దుహింసించెనో
తంద్రీ నామదశోకమారునె మహాదౌష్ట్యంబు సంధిల్లఁబో
క్రంద్రంజంపక వంచు మనుద్వృత్తవక్త్రపోల్లసద్దంష్ట్రయై. ౧౨౨

ఉ. మానుగఁ గాంచినా సుతుని-మానుష తేజు వధించి యట్టిదు-
ర్మానిని జాపకున్న మిము-రమ్మందఁగ మోఁదెద నన్న వారల
మ్మానినిఁ గాంచి భీతియుత-మానసులై తగ నిట్లు వల్కిరి
మ్మానిజమూలకించు మొక-మర్త్యవరేణ్యుఁడు ఉగ్రుం జెనా పుడున్॥

ఉ. అంగన వానిఁ బట్టి పరి-మార్పఁ దలంచి కడంగి ఘోరతా-
లాంగన వోలెఁ గోయుచు మ-హాటవి నొక్కెడఁ గాంచె సాధ్వినా-
త్మాంగనఁ గూడి సోదర స-హాయము నంద గుణీతిఁ బర్ణశా-
లాంగన మొప్పఁ జేయు మహా-త్ముని రాముని కీర్తికామునిన్. ౧౨౪

వ. ఇట్లు గాంచి, ౧౨౫

ఉ. వామకరోల్లసద్ధశన-వారవిభాచపలాంశుజాలమున్
శ్యామలవర్ణముం బటుద-యారసవృష్టియుఁ గల్గి కానలో
నీమెయి మున్న వాఁడు ఘనుఁ-డీతఁడు సంశయమింత లేదు నా
కీమహనీయ తేజు నెడ-నెంతయు నగ్గలమయ్యెఁ గామమున్॥ ౧౨౬

వ. అని మతిలో నతని నందఱివి సఁకకనుంగొని. ౧౨౭

సీ. ఇతని మోమరవింద-మితనికన్నులయంద,
మిందీవరంబుల-పొందుఁదెగడు।
నితనికటులులితన్న్-లితనిమాటలచిన్న,
లలసుధాధారాన-యంబుఁదెగడు।
నితనిపాక్కులిబాలి-యితనిచెక్కులతీవి,
యలదర్పణములసో-యగముఁదెగడు।
నితనిమోవిపగడం-బితనికంఠముడంబు,
కంబుమానితసుంద-రంబుఁదెగడు।

గీ. నితనిహస్తములస్తము-లితనివెడఁద।
యురము యురమిమ్మహాత్ముపొం-దొప్పఁగాంచి।
యొలమినొందనిజన్మంబు-వ్యర్థయటంచుఁ।
జేరఁజనుదెంచెరాక్షస-స్త్రీరయమున॥ ౧౨౮॥

క. మునివర్యులకున్ద్రోహము।
జనియింపఁగఁజేయురామ-చంద్రుంగనికా।
మినిద్రోహచరిమోహిం।
చినదనుటకుధరణిసేమి-చిత్రముతలఁపఁగ॥ ౧౨౯॥

క. కనిరివవంశ్యులుజేరం।
జనుదెంచెదుదానిఁగుసుమ-సాయకబాణ।
ప్రనిహతమనోబ్జజనఖం।
డనపటుతరతీక్ష్ణశూర్ప-ణఖశూర్పణఖ॥ ౧౩౦॥

అయ్యవసరంబున లక్ష్మణుఁడు నీవెవ్వరి దానవివ్వలనికి రాఁబ్రయోజనంబు నీకుంగలుగజేము దశరథరాజనందనుల మివ్వనంబునకు విహారార్థంబుచను దెంచితి మెడగలిగిపొమ్మనుఁడు నతనినాదరింపకయన్నిశాచరి రామచంద్రుంగనుంగొని॥ ౧౩౧॥

ఉ. ఆతతకీర్తిపూర్వవిబు-ధాధిపశేఖరుఁడైనరావణా।
ఖ్యాతునితోఁడఁబుట్టువన-శంఖిణిప్రసిద్ధులస్త్రీవంశసం।

జాతసునిన్నుఁ గాంచి సుమ-సాయకసాయకపీడితాంగనై
ఖీతను వేలరాదు వసు-ధేశ్వర నన్ను వరింపకుండినన్॥ ౧౩౨॥

వ. అదియునుంగాక వినుము నేను కామరూప ననేకవిధ సుందరాకారం
బులు వహించి ప్రీతుం జేయను దలఁచినచోటికి నిన్నెత్తికొని పోవ
ను నేర్తు మదీయ నామధేయంబు శూర్పణఖ నన్నుం గలసి భవత్ప్రి
యానుజ ప్రియాసహాయం బపేక్షింపక కామోపభోగంబులను
భవింపుమని పల్క-ననవ్వుచు నతం డారక్త-సింగనుంగొని॥ ౧౩౩॥

క. కుమతీ చంపక విడిచినఁ
బ్రమదంబునఁ బొంగి చనక-ప్రత్యుక్తులఁ గూ
టముఁ గోరెదు జాతోరా
కుమతన్నుం జంక నెత్తి-కొనుమను భంగిన్॥ ౧౩౪॥

క. అనిపలుకునంత దానిం
గనితద్వాక్ప్రతాకృతియును-ఖరనిస్వనముం
దనకద్భుతమగుదుధరా
తనయునగిరియొనగిఁ గ్రోధ-తామ్రాననయై॥ ౧౩౫॥

ఉ. ఆదనుజాంగనాధమధ-రాత్మజఁ గన్గొనినిన్ను బ్రమింగినం
గాదను వారు లేరనను-గర్వముఁ దక్కు మటంచు దానిహృ
ద్భేదన వాక్యసంతతులు-పేర్మిని రాముఁడు కర్ణనాశికా
చ్ఛేదనమాచరింపుమనఁ-జెచ్చెర లక్ష్మణుఁ డట్లొనర్చెన్॥ ౧౩౬॥

క. ముక్కుఁ జెవులుఁ దెగిపో[illegible]
ముక్కఁటిరక్కసులు వెగడ-[illegible]రవమునఁ దా
టక్కరి మిక్కిలి యేడ్చుచు
నిక్కరణి స్వయుధర్మ-నేమికనుమన్॥ ౧౩౭॥

ఉ. కాలము ప్రొక్కనంగినియు-వాయుభుగంగనభంగినింగిపై
తూలరయంబునం బఱచి-దుర్మతియప్పిశితాశియన్నచే
కోలగమున్నచోటయధి-రోద్గమవైకృతకర్ణనాశికా
మూలము లెంతయున్నలుప-ముందఱ వ్రాలెఁ గరంబు దీనతన్॥

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# దాశరథివిలాసము.

## పంచమాశ్వాసము.

---



శ్రీవనితాయుతవక్షుసు।
దీవనమాధవసదృక్షు-దితిజవిపక్షా।
పావనమునిపక్షాభ।
క్ష్మావనకృతదీక్ష వేంక-టాద్ర్యధ్యక్షా॥ ౧॥

వ. తదనంతర కథావిధానం బవధరింపుమట్లు రామలక్ష్మణులు ఋశ్య
మూకోపాంతకాంతారంబున విహరించుచుండిరని చెప్పి వాల్మీకి
వెండియు నిట్లు చెప్పందొడంగె నట్లున్న సమయంబున॥ ౨॥

చ. హరితనయుండు కన్గొనియె-నాదటభీతమ లైఁచూపుల।
స్సురుచిరరూపులనఘవి-శుద్ధగుణాఢ్యులసత్కలాపులం।
బరమరవిప్రతాపులను-మర్దితదీనజనానుతాపులం।
గరధృతచాపులన్నియమి-కర్మకలాపులవీతపాపులన్॥ ౩॥

క. కనితననిజాప్తులంగనుఁ।
గొనియవ్వారకులాబ్ధి-కువలయహితులం।
గొనిచనితగవారలక।
మ్మనుజాధీశ్వరులఁజూపి-మనముగలంగన్॥ ౪॥

క. మునిధర్మపరాయణులీ।
యున్నతధర్మధురీణులగుచు-మున్నారటుధ।

ర్మనిరతు లెవ్వారలపం।
పునవచ్చిరొ మీకుఁ దెలియఁ బోలును చెపుఁడా॥ ౫॥

వ. అని వాలిపంపున వచ్చినవారని వారనిభయంబున నడఁగియడిగిన నినతినయాభిప్రాయంబు గ్రహించి సుజనవిధేయుండగు వాం జనేయుండు రచనంబులగు వచనంబుల నిట్లనియె॥ ౬॥

క. వీరులు ఖతౌరివారలు।
వీరులు మహనీయులిట్టి వీరలనొరులె।
వ్వారలు పంపఁగ జాలెదు।
వారలు తముదామయిటకు-స్వచ్ఛందగతిన్॥ ౭॥

వ. వచ్చినవారలని తలంతునని పలికి మఱియు నిట్లనియె॥ ౮॥

మ. హితవాచంయమిసేవధారులు కృపా-దృగ్జాలురుక్షత్రియా
కృతులీవీరలు వాలినేపడఁచి కి-ష్కింధాధిపత్యంబున।
స్తుతినీకీనిరుమేనుల్ప్పఁగ రమా-మానిన్యధీశుండును।
ద్ధతినేతెంచిననందనర్చిరిజగ-త్కల్యాణచారిత్రకుల్॥ ౯॥

ఉ. వారివిధంబుసర్వముఁవుఁత్రవంబుగనారసివచ్చివేసుక।
వ్వారికినీకుసఖ్యమున-వస్యముఁగూర్చెదనట్టులైననే।
వారికిలోనుగానిబల-వంతుఁడవయ్యెదవెట్టివైరులం।
జీరికిఁగొందువేప్లవ-సింహునివాలినిగెల్వనేర్చవే॥ ౧౦॥

క. అనివారిసమీపమునకుఁ।
జనిమాయాభిక్షుకత్వ-సంభృతుఁడగుమ।
న్వనమెల్లఁడనతనూనా।
తనవిలసన్మొప్పఁజేయఁ-డగియెదునిభృతిన్॥ ౧౧॥

ఉ. చేతులుదోయిలించికపి సింహుఁడువాయుసుతుండు మ్రొక్కినీ।
ర్భ్రితులుసద్వినీతులున-పేతకునీతులఁబూతులఁజగ।
త్ప్రీతులుమీరుమానులవి-ధంబుఘోరవనావనీస్థలీ।
యాతులుగాఁగనేటికిద-యామతులారయొలుంగఁజెప్పరే। ౧౨॥

మ అనియడిగి వెండియు॥ ౧౩॥

క. చక్రిశసదృశ బాహులు।
జక్రధరోపములు జక్ర-చక్రసములు।
జక్రహితరిపువిభులు సువ।
చక్రమపేశలులు సుకటి-చక్రులు మీరల్॥ ౧౪॥

క. మహానైవ్యారలు వీరలు।
బహుసుగుణావహులు నియమి-భారవహులనా।
గ్రహులుమహామహులిద్యోడ।
నహిశయమునిద్వ్యక్కృతులన-నలరెదరవిసర్॥ ౧౫॥

ఉ పాణిసతీసువార్తఁ గొని-రాఁగలధీయని గానెతెంగియో।
పాణువరంబుకంబరిమ-సాధ్వికినంజనకుండగంజగ।
త్ప్రాణుని చేఁ బ్రజాతుఁడగు-ధార్త్రికుఁడంచుఁదలంచియోపరి।
క్షీణవిచారుఁడై ముదముఁ-జెందెను రాముఁడుత న్మహోక్తులన్॥ ౧౬

వ. ఇట్లు సంతసించి సహోదరుంగనుంగొని॥ ౧౭॥

క. మనవృత్తము సర్వములు।
క్షణయితనికెఱుంగఁ జెప్పు-మాయన వుడుస।
జ్జనమణి సౌమిత్రిన రేం।
ద్రుని యానతిమిగులనచ్చి-తోనిట్లనియెన్ ౧౮॥

ఉ. భానుకులాబ్ధిపూర్ణహిమ-భానుఁడుప ఙ్క్తిరథాధిపుండుత।
త్సూనులమీతఁడగ్రజుఁడుసువ్రతచర్యుఁడు రామనాముఁడా।
త్మానుజునన్ను లక్ష్మణస-మాఖ్యుని గూడికడంగి భార్యతోఁ।
దానును వేడ్కఁ బంచవటిఁ-దాతవచస్థితినున్నయంతటన్॥ ౧౯॥

క. ఈసుశ్లోకుని సతిసీ।
తాసతియే మిటపురము ను-దాదవ్వులసం।
త్రాసవన స్థితి మెలఁగెను।
నా సమయమునందు రాక్షసాహ్యాత యైనన్॥ ౨౦॥

క. తత్కాంతారత్నము నే।
తత్కాంతారస్థలముఁ-గందుమనుచురీ।
ణోత్కలిక వెదకి విపులా।
పత్కలితుల మొక్కఁ జోఁగ-బంధుమదాంధున్॥ ౨౧॥

క. కనివాని వానిశాపం।
బునఁదగముఁగానొర్చి-పోలుపుగఁ పుడా।
ధను నాముని చేసుగ్రీ।
వునివినితత్సఖ్యము నన-వుంబజులెల్లన్॥ ౨౨॥

మ. అనితన్మర్కటనాథదర్శనసమీహాబద్ధహృద్గ్రంథియై।
వినుమించోచ్ఛ్వసించి నాఁడురుజగ-ద్విఖ్యాతమూర్తస్యమూ।
ర్ధ్నని తాంతస్ఫుటదీప్తిమాళిఘటనా-త్యంతప్రశస్తాంఘ్రిపా।
ద్మనకీరాఘునకబ్జజుండెగచరేంద్రుం గొల్వ వాఁ సెంగటూ। ౨౩॥

వ. అని పలికియన్న దెసకు విన్నవై కన్నీరు మున్నీరుగా వగచుచు న్న యన్నరవరున కత్తఱిచరవరుం డిట్లనియె॥ ౨౪॥

క. ఏఁ గిదినవాక్యములగు।
నాపదలకువగలఁబొగల-రాద్యులుశోక।
స్థాపితహృద్వృత్తులకుఁ।
బైపయి నాపదలుఁ వోడముఁ-బలముఁదొలంగున్॥ ౨౫॥

వ. కావున సుస్థిరుండవగుమని యనునయించి యనంతరంబున రామ లక్ష్మణులంగని॥ ౨౬॥

క. బంటనిటు విసుఁడుశోకం।
బంటవిహృదయము లతోడ-నజ్జనకసుతం।
బంట వెలఁది మోములదగు।
పంట వెదకి కాంచునట్టి-పనివాఁడిచుఁడీ॥ ౨౭॥

వ. అనియిట్లు॥ ౨౮॥

క. తగఁగనవిసులుఁలనవికలు।
లఁగుఁడనిలసుపనిబిసమగు-నతిదీర్ఘతరం।

బగువాలముఁ ద్రిప్పుమన।
య్యగచరుఁ డిట్లనియె నైజ-మగు గతిఁ దెలియన్ ॥ 29॥

క. అంజనసుఁ బ్రభంజనునిద।
యంజననము నొందినాఁడ-హనుమద్విఖ్యా।
తింజను లెన్నన్ ఖలులం బ్ర।
భంజనమొనరించు సత్ప్ర-భంజను వాఁడన్ ॥ 30॥

క. సుగ్రీవాగ్ర సచివుఁడను।
దగ్ర గ్రావాగ్ర వాసి-నైమిముఁగనిభూ।
పాగ్రణులు భవత్సఖ్య స।
మగ్రావాప్తి నెదఁగోరి-యాతఁ డిటు పనుపన్ ॥ 31॥

ఉత్సాహ.
పంపవచ్చినాఁడ నతని-పంపలం ఘునీయమా।
పంపఁ జాటిమీర లిందు-బాణతూణధారులై।
తెంపు నంజరింపఁ గాంచి-తెంపు లేక భీతి చేఁ।
ద్రెంపి కొనియె ధైర్యవల్లిఁ-దిగ్గభానసూనుఁడున్ ॥ 32॥

చ. వినుఁ డతఁ డన్న దన్బరిభ-వించి సతీవిభవంబు లెల్లఁ గై।
కొనుఁడుఁ దదీయసత్త్వమున కుం బ్రతిసత్త్వము లేమి నాతనిం।
జెనకిఁ దలంకి యగ్గిరిన సించినవాఁడ ఘటప్రభవత్సహా।
యనిశితఖడ్గధారను-మాడఁదలం చెవింధిసాలమున్ ॥ 33॥

క. ఘనులార యతనిమిత్రత।
కను కూలతి నొందుఁడనుడు-నత్తోయిఁదగ।
న్వానుమాడఁబో వుతీర్థము।
చను దెంచినయట్లు కాంద-చయ్యానమాటన్ ॥ 34॥

క. స్తయరహితనీవుచనిని।
శ్చయముగ సుగ్రీవుతోడి-సఖ్యము మాకుం।
దియఁగూర్చినవోయన్య।
ప్రియకాయలమగు మనఁగ-పి ప్రభుఁ డాత్మన్ ॥ 35॥

గీ. పొంగితరభంగి నానృప-పుంగవులను
బూర్ణకరుణాంతరంగులఁ-దూర్ణముగను
వోడుకొనఁ బుశ్యమూకంబుఁ దొలుతఁగడచి
యధికసౌరభసుమనిలయముమలయము॥ ౩౭॥

క. కనిరామునిరామునిరా
ముఁతమ్మునినందునిల్పి-ముదమునసుగ్రీ
వునిసుగ్రీవునిఁగనియు
ట్లనియెన్నఁగరానిహర్ష-మైయిట్లనియెన్॥ ౩౮॥

మ. రవిసన్నందనఁ బుశ్యమూకధర-పాంతారకాంతారవా
రవిహారస్థితులైన రాఁకొమరులం-బ్రావీణ్యముస్తాలివై
రవిధాయాగతులంచుఁ నెంచుచుఁభయ-భ్రాంతుండవైతిట్లువా
రవివంశప్రభవుల్జగత్ప్రభువు-లత్యంతప్రసన్నాత్ములన్॥ ౩౯॥

వ. తదీయమహానుభావంబభి వర్ణనీయంబనిపలికి మఱియు నిట్లనియె.

క. విఖ్యాతిమీఱనీదగు
సఖ్యాతిశయంబుఁగోరి-చనుదెంచిరిప్ర
త్యాఖ్యాతవైరులత్యమ
లాఖ్యాతులు వారిఁబొగడ-నలవియె నాకున్॥ ౪౦॥

తే. అనుమవారియొందఁతమా-ద్యంతమగచు
కేంద్రునకుఁదెల్పి వెండియు-నిట్టులనియె
నీదపాపఁడువెఱచిగ-ట్టెక్కనేల
యిపుడనీకష్టమెల్లఁగ-ట్టెక్కనుఁడు॥ ౪౧॥

ఉ. ఆచలిగట్టుపట్టినెన-రారఁగ వుంగిటఁబట్టిచిన్నవాఁ
డాచలిగంటుఁబంపనుచు-నాఁకటమిగ్రంగఁగఁబోయినట్టినీ
వాచలిగట్టుఁబిట్టువడ-కాడఁగమెట్టెడుఁదిట్టవిట్టిచో
నాచెలికాఁడవైతివిక-నాకుఁగొఱంతగలంగదొక్కఁడున్॥ ౪౨॥

వ. అని ప్రశంసించి॥ ౭౩

క. హృష్టమతిం బురుషార్థచ
తుష్టయమునఁ దగు సచివచ-తుష్టయము మెప్పం
దుష్టయ్యయోభువనపూర్ణో
త్కృష్టయశు నాత్ముఁ జూడఁ-దివిరెడు ముదితో౯॥ ౭౪

క. నిటలతటఘటితాంజలి
పుటుఁడై మర్కటవిభుండు-పులకపటలము
ల్పటుగతిఁ జేనాలమి కొన
నటుచని రాము న్సహోత్థు-ననుజాన్వితు౯॥ ౭౫

సీ. కని పేదపెన్నిధిఁ-గనినచందంబున,
నత్యంతసంతోషి-తైతదీయ
చరణారవిందసం-స్పర్శితనిజఫాల,
భాగుఁడై యానంద-బాష్పసలిల
పూరితాక్షుండగు-సౌరిసమీక్షించి,
రాముండు గరుణాబ్ధి-రాముఁడగుట
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి-కొనియె నయ్యంతరం,
బున సుమిత్రానంద-నునకు మ్రొక్కె

గీ. యతని మున్నఁ బడసెన-య్యవసరమున
రాముఁ డనుజన్ముఁ గూడితో-రమునొక్క
చోటవాసీనుఁడయ్యెన-నాటుఁడొక్క
పలనఁ గూర్చుండెఁ దనసచి-వవరులలర॥ ౭౬

క. తగ నెల్లవారుఁ దమఁ గొలు
వఁగఁ గొలువలరించు రామ-వల్లభుఁడు పు
డమ్యాగచరులు గొలువఁగ మున
వగఁ బునఁ గూర్చుండెఁ దైవ-వంచనకటా॥ ౭౭

వ. అట్లున్న యవసరంబున సామీరి నుద్దేశించి రాముండు సౌమిత్రి కిట్లనియె.

క. ఈతని కతమున భవదీ।
యాతతవర్తనము తెల్ల-మయ్యెను మాకుం।
బూతాత్మ చ్చరితంబును।
సీతాఘుం డితనివలన-వింటివి నీవున్॥ ౪౯

వ. కావున॥ ౫౦

గీ. మిత్రసత్పుత్రఖండితా-మిత్ర నీదు।
మైత్రి యనియెడు ఘనయాన-పాత్రమునను।
నిశ్చయంబుగ విపదంబు-నిధిఁ దరింపఁ।
గోరి వారము దగ నియ్య-కొనుము దీని॥ ౫౧

చ. అనవృకు సంతసించితగ-నట్టుల సేయుద మీరు నేము న।
ఖ్యనిరతి నున్నవారము ప్రి-యంబునఁ బొందొడఁ గూడు నేనిఁ జ।
క్రనగు సమస్తకార్యములుఁ-గంజహితాన్వయులార వేఱ వే।
యనఁ బని యేల రాలను ద-శాగ్రములన్ని లుపంగఁ జాలమే॥ ౫౨

వ. అని పలికి మహానందుండై రామచంద్రుం గనుంగొని॥ ౫౩

క. తనుజాతబుద్ధియె భూ।
తనుజాత హరించి మాగ్ష-తనుఁ జరగినయ।
ద్దనుజాతజవసైన్యా।
తనుజాతమడంచి మహీసు-త న్వేసఁ దెత్తున్॥ ౫౪

క. అని సుగ్రీవుఁడు పలికిన।
విని సుగ్రీవుండు రామ-విభుఁడ ప్పావయా।
తనచేఁ దనచేని హసా।
తని చేఁదవ చేని దాన్స్మ దంబల రారన్॥ ౫౫

వ. ఇట్లన్యోన్యంబును జేతంజేయి వెట్టి సఖ్యంబు గావించి మఱియు నగ్నిసాక్షికంబుగా నక్రర్మసాక్షినందనుతోడ సర్వసాక్షియగు శ్రీరాముండు మిత్రత్వంబు సంఘటించె నంత. ౫౬

క. లీనగతిఁ ద్రొల్లినీయా
లీనగ లీనగము నరుచు లీనఁగ వైచె
న్భానునిభాయనిజనకసు
తానిక్షిప్తోర్వలంకృతంబులు నూపక్ ॥ ౫౭॥

క. ఆపోవని చూడ్కులను
డాపూషాన్వయవరుండు నా భూషణము
ల్జేపట్టి లక్ష్మణునకుం
జూపెట్టుచు రాముఁ డధిక శోకాతురుఁడై॥ ౫౮॥

వ. మహీతలంబునం బరమమూర్ఛాపరవశుండై పడి కొంతవడికిం గొండొకతెలిసి నిజచరణసమీపంబున దుఃఖాతిశయంబునం బొరలుచున్న సౌమిత్రిం గనుంగొని. ౫౯॥

క. ధరణీతనయామధురా
ధరసంపర్కగతఘనసుధాబిందులు సాఁ
గరముఁ దనరారెనీముం
గరముత్తియములనఁ జూడఁగా సౌమిత్రీ॥ ౬౦॥

క. వనగజకుంభంబులఁ బు
ట్టిన సతికుచకుంభములన టించినసీహా
రనికాయంబునకిటువల
పెనుజిక్కువడంగ నెలవుఁ జెడఘనమగునే॥ ౬౧॥

సీ. తగినతాటంకములధగద్ధగలుమాసెఁ
గాంచికాకింకిణీక్వణక్వణనమడఁగె
లలితమంజీరపటుఝుళంఝుళలుడొంకెఁ
దరుణి నెడఁబాసియున్నకతమునఁ గాదె॥ ౬౨॥

క. ధృతినగ శేగతిఁ దాల్తుం
బతిఁ బాపితి నను చుభూవిపతితము నేయం

గతిమాలి భూపలిదనా।
గతి వైవర్ణ్యంబుఁ దాల్చెఁ గాంచితె వత్సా॥ ౬౩॥

వ. అని యనేక విధంబుల వగచి వగచి పుడమిపట్టి నష్టుఁడయెడఁ బా
పినట్టులఁ జిత్తంబున నమృతంబు గ్రొత్తసేయం బవనసుతుండు ప్రియ
వచనంబుల ననునయింప నూఱడిల్లె నిట్లు సుగ్రీవునితోడం బ్రదన
ఖ్యుండై యవ్వానరేశ్వరు నుద్దేశించి ప్రమదాతిరిక్తంబున॥ ౬౪॥

ఉ. మిత్రతనూజపౌత్రమగు-మిత్రుఁడవైతివమిత్రగోత్రగో।
త్రత్రుటనాస్వరుప్రకటి-తప్రబలాస్త్రదమోఘవృత్తుల।
స్మ్రుతులు నీకుఁ గల్గెనె-సందున మాకదనమ్ముఁ బుణ్యచా।
రిత్రుని రాముఁ గన్గొనిమా-రిప్రియపుత్రుఁడనంతతోషియై॥ ౬౫॥

వ. సకరుణంబుగా నిట్లనియె॥ ౬౬॥

క. నాకగ్రజుండు వాలివ।
నౌకోగ్రేసరుఁడు బలిమి-నాయాలి సుమం।
గైకొని వెడలఁగ నడిచిన।
నా కీగ్రామమున వేద-నం బడవలసెన్॥ ౬౭॥

క. నయ మొక్కింతయుఁ దలఁపక।
నయమునుం బాధింప రామ-నరవర యిచ్చో।
నయముం జెడి తిరిగెదనే।
నయమునం జూడంగ వాలి-నను పుముశక్తిన్॥ ౬౮॥

వ. అని పలికి యంతనిలువక. ౬౯॥

శా. నిష్కారుణ్యుఁడ గారదారకుఁడుర-న్నిశ్లేషశుష్కత్రుశో।
చిష్కుండై నందనర్చి వినభ-స్త్రీభూతుఁ గావించి ధా।
నుష్క్రగ్రేసర పుష్కరాక్షులను వ-న్నం బ్రీతి వీక్షించినం।
గిష్కింధాధిపతిత్వమిందదఁగదుం-గీశుల్ప్రశంసింపఁగన్॥ ౭౦॥

క. తనయాలి విడుచునతఁడుం।
దనయాలిన్విడుచునతఁడు-దశరథభూభృ।

త్తనయాలేశంబును వే।
తనయాలకు నిందుదురు న-దాతలపోయన్॥ ౭౧॥

వ. అని పలికి మఱియు నవ్వాలి ధైర్యస్థైర్యాది గుణంబులగ్గింపఁదలంచి యిట్లనియె. ౭౨॥

స్రగ్ధరావృత్తము.
మాయావిం దన్ని చీరె-న్మదమఱ బ్రబలో-న్మాదుఁ డైతన్నఁ జీరె।
న్మాయావిందుం గభిన్నా-మవడఁ జిమడిపె-న్మానకున్నన్ని తత్త్వ।
మ్మాయావిశ్వంభరాభృ-ద్వ్యసననిరతుఁ గా-హంక్రియందో లెక్రీరా।
మాయావీర ద్విధీరు-న్నఘువసుతుసా-మర్థ్య మెన్నన్వశఁ బే॥ ౭౩॥

వ. మఱియు నబ్బలాధికుండు. ౭౪॥

క. దుందుభినడంచి దివిసుర।
దుందుభులు సెలంగ శక్తి-తోనప్పుడతఁ।
డ్మందర నిభకుణపంబున।
మందరభసుఁడగుచు వీచె-మహిమాధికుఁడై॥ ౭౫॥

వ. ఇట్లు ఋశ్యమూకాచలాగ్రంబునకు. ౭౬॥

క. జోటజోట నెత్తురుతులవి।
చుటయుందపమాచరించు-చుఁజటిలుఁడోకఁడ।
చ్చోటనుండికటములదరం।
బటపటపికటుగి తిఁదంత-పటలిగొఱుకుచున్॥ ౭౭॥

ఉ. క్రోవ్వననిన్న గాగ్రమున-కుంగుణపంబిటుపట్టివైచె నేఁ।
డెవ్వఁడతండు వారిజభ-వేశ్వరులడ్డిననైనఁ జచ్చుఁబో।
యివ్విపులాధరాగ్రమున-నెక్కినయంతనయంచు శాపమీ।
నవ్విపులోగ్రవాక్యనిచ-యంబులు వింటిమి నేను వాలియున్॥ ౭౮॥

వ. ఇవ్విధంబున మతంగమహాముని నీంద్రుండు శపించుటం జేసి యిన్నగంబుననున్న నన్ను మాయన్న వెన్నడింపవెఱచియున్న వాఁడనిపలికి యతనికింపెనఁగల పూర్వవైర కారణంబు సవిస్తరంబు

గా నతింగించి విషాదవేదనా దోదూయమానమానసుండగు భా
నుసూనుననునయించి మేఘగర్జితసంకాశంబులగు భాషణంబు
లఁ బూషసుతకుల భూషణుం డిట్లనియె. ౭౯॥

కం. ఆలింపుము రవిసుత నీ।
వాలింగా జెదవు నిశ్చ-యంబుఁగ నిఁక లే।
దాలస్యము జవవచ్ఛర।
కీలింగీలించి వాలిఁగీలింగాల్తున్॥ ౮౦॥

కం. నేలఁబడఁగూల్తు హరిసుతు।
నేలఁబడం జాలి వా-నరేశ్వర నీ చే।
నేలఁబడుం దత్పదమిఁక।
నేలపడతికూఁతు వెదక-నీ పని సుమ్మా॥ ౮౧॥

వ. అనినమ్మిక వోఁప నాడుటయు సుగ్రీవుండు జడస్వభావంబుగా
నిట్లనియె॥ ౮౨॥

కం. మాయన్న మున్న దుందుభి।
మాయన్న శియింపఁజేసి-మడపిన కాయం।
బోయన్న కదల్పనఁజా।
మ్మాయెన్నఁగ వచ్చు వాలి-నణఁచెద వనుచున్॥ ౮౩॥

చ. అనవినివవ్వి రాముఁడును-హాసముఖుండఁడఁ గూడి వాసవి।
ప్రణిహతదుందుభి-ప్రకట రాక్షస కాయము హేయముంగనుం।
గొనిచరణాంగుళిస్థితియు-గోటనమీటినఁదచ్ఛవంబు రయా।
జనము గుదూరదేశమున-శైలమనన్వడిఁ గూలెఁగూలినన్॥ ౮౪॥

కం. కని విస్మయంబు మనమునఁ।
బెనఁగొన వానరులు రాముఁ-బృథుపార్ష్ణమునం।
గొనియాడిరంత నారవి।
తనయుండిట్లనియె నద్భు-తప్రమదమునన్॥ ౮౫॥

ఉ. వాలిజవంబునన్విసరి వైచినకాయమితండుగాలిచే
న్వ్రేలునఁదూలమీటెఁగడు నింతియ నంజనదిప్పఁడెందుటం
దేలికయయ్యెనాతనివ ధింపసమర్థుఁడవేనిపూనియో
తాళములొక్కప్రక్కలవసుంధబడంగూల్చఁజాలనమ్ముదున్॥ ౨౬॥

క. అనితాళసప్తకముఁ జూ
పినదశరథరామకార్య్య పీనాధసుతా
గ్రణియుఁ గపీశుఁడుఁ దను మె
చ్చవలఁ బాణంబువింట సంధించికడున్॥ ౨౭॥

చ. లలివిడువంగలంబమపి లంబగతిందృణరాజసప్తకం
బిలనొక పెట్టఁగూలిపడ నేసిధరన్వెసదూసిధారుణీ
తలమును బాసిభోగులప దంబుక్షణంబునడాసిరాముని
మ్ములపొదిఁ జొచ్చె నెల్లరుఁ బ్రభూతభయాస్పదులైరినుంగొనన్ ౨౮

క. తాళములఁ గూల్చె వెసఁ బా
తాళముఁ గనిబాణ మత్యుదగ్రత వెడలం
దాళకభూతంబులు బే
తాళంబులు భీతినొందెఁ దత్క్షణమాత్రన్॥ ౨౯॥

క. తాళ్ళు దెగనింకదనుజుల
యాళ్లయొడళ్లఁ గలమంగళాభరణములం
దాళ్లుమనకాళ్లసంకెల
తాళ్ళను దెగునను చుదివిజతతిదివినలరన్॥ ౩౦॥

క. అప్పుడు తాళములో నుఁ గెడు
చప్పుడుకకుభములనిండ సకలశుభంబు
ల్లొప్పదు వాలిందునుమక
తప్పఁడితండనుచుఁ దరణితనయుఁడువొంగెన్॥ ౩౧॥

వ. మఱియుం జనమనంబున నపరిమితానందంబు నొందె నయ్యవస
రంబున॥ ౩౨॥

గీ. వాలితోఁ బోరు నెడ నావ-వాలితిండు।
మాలియైనను నీవంశు-మాలితనయ।
ఎఱ్ఱితి నొక్క ఘోత్తుఁదగులు వ్రు-మరుగు మట్టు।
తేనిరిపుఁగూల్తు నేఁడ్డు-తేనికడిమి॥ ౧౧౫॥

వ. అనుటయుం దత్క్షణంబున. ౧౧౬॥

ఉ. జ్ఞానిసుతుండు సంగరవి-శారదుఁడు న్మహనీయకీర్తిప్ర।
జ్ఞానిధి రామమూర్తి సము-ఖంబున వాయుతనూభవుండభి।
జ్ఞానముగాఁగ నెంతయుఁ బ్ర-యత్నము నన్వరించి తెచ్చిన।
స్నానముతోడ సుంచెసుమ-మాలిక నేలికకంఠపాలికన్॥ ౧౧౭॥

వ. అంత. ౧౧౮॥

క. కంధరధృతమాలికు ఘన।
కంధరనిభదేహు రవిజుఁ-గని రాముఁడు న।
ర్వాంధుభవ ఽగ్రజన్ముసు।
ధాంధఃపతిపుత్త్రి బిల్చి-మాహవమునకున్॥ ౧౧౯॥

చ. అనవుఁడు సంశయంబు హృద-యంబునఁ దోఁపఁ దడంచి శోంచు నే।
చనివిబుధేంద్రనందనువి-సాహసమొప్పఁగఁ జీరెఁ బేరెలుం।
గున సమరంబు సేయ నిది-గోఁజను చెందినవాఁడనంచు న।
ధ్వనివిని వాలి పంకజహి-తప్రభవున్ సమయింపనుగ్రుఁడై॥ ౧౨౦॥

వ. చను దెంచు నెడ నెడ సొచ్చి నఖవిజిత తారయగు తారయిట్లనియె॥

క. విను బలవంతుని నెనుబాౘి।
పున వచ్చిన వాఁడు తపన-పుత్త్రుఁడు కాఁడు।
వ్ను మహోం పారి మరలం।
జను దెంచు నెకలనకిది వి-చారించు మెదన్॥ ౧౨౧॥

క. హ్రాసయేళ నాహుతింగడు।
బెదరోదవిఁదదియుఁ గాక-ప్రియసుడి దెసనా।

చ. అలసత వాలికోపపరు- షాక్షరగుంభిత వాక్యసంతతుల్
ల్పలుక రఘూత్తముండవని- పాలశిఖామణి రామభద్రుఁడు
బ్బలిముఖులోకనీకిటులఁ బ్రాణము వీడఁగ ధాత్రి వ్రాఁతముం
గిలుగఁగఁ దప్పనెట్టు లెఱుఁ-గన్వశమా నెపు రాకృతంబులన్॥

వ. అదియునుం గాక॥ ౧౪౭॥

క. నీవు నెవ్విధమునఁ బరిమా
ర్చినవాఁ కుంబాతకంబు-సిద్ధింపదు లే
మ్మునిభార్యదుమం జెఱ
పిన పెనుదోషివి సిగ్గు లేక- వేప్రెలెదవనుమన్॥ ౧౪౮॥

క. వాలిదన మూఱుమడువుల
కోలిసదుత్తరములిచ్చి-మిన్న యిరలఁదా
వాలించి కపికులాధిపు
వాలించుకతాల్మిలేక-యవశతగొంచున్॥ ౧౪౯॥

మ. గళదశ్రూదకధారలై విగతమా-ల్యాహారవిస్తారలై
చలదత్యల్పదరావలగ్నలయి వి-స్రస్తాసితాభుగ్నకుం
తలలై హస్తతలప్రతాడనవిధూ-తప్రోల్లసత్ఫాలభా
గలసత్కుంకుమచిత్రకప్రచురలై యత్యంతదీనాత్మలై॥ ౧౫౦॥

క. చనుదెంచి జీవితేశుం
గనుఁబోయెదు జీవితేశుఁ-గనితారమహా
ధ్వని రామచంద్రుఁ డను
య్యనఘానవకుంగరుణమావ-హింపఁగ నేడ్చెన్॥ ౧౫౧॥

వ. ఏడ్చి రామరాజన్య కంఠీరవ శిలీముఖనఖవిభిన్నంతగుశాఖామృ
గకుంజరుం గనుంగొని। ౧౫౨॥

క. వానరనాయకయువుడీ!
వానరనాయకుని బా ణ-హతినీగతిన।

ర్తను జానిచేఁ జావవలసెఁ।
జను నేరెవ్వరికి సహజ-శత్రుత్వంబుల్॥ ౧౬౦॥

వ. అని ధర్మంబుఁ దోఁప నాడి॥ ౧౬౧॥

సీ. మఱియు శోకాంబురాశి-ర్మగ్నయగు మ।
హస్తయుగ్మకమున నిజ-మస్తకంబు।
మోఁదికొనుచు వదఁ తోడ-మీఁద నున్న।
ధవుని తలడించి తార రా-ఘవునిఁ గాంచి॥ ౧౬౨॥

క. ఒకతోఁ బోరదు నావకు।
మరుతనయుఁడంబుతోన-నొదిగియొదిగసం।
గరధర్మజ్ఞా విదుండవు।
ధరణింబడఁ గూల్చితివివి-దాత్ర్యని చెయికిక్॥ ౧౬౩॥

ఉ. నీసతిసీత నెత్తికొని-నింగిఁ జెలంగు మనేగ రావణుం।
డాసురవృత్తి నాకు రగ-ణారివధింపక నీవు నావిభుం।
జేసితి కాలగోచరుఁ గఁ-జెప్పెడిదేమి యొకండు నేరముం।
జేసిన శిక్షచేఁ జోకనిఁ-జేసితి సామ్యము చెప్పినట్టులన్॥ ౧౬౪॥

క. మిత్రతనూజా ఘనుఁడగు।
మిత్రునిఁ గానెంచికొనియు-మిత్రత్వంబుం।
గోత్రరిపుసుతునిపైనో।
ధాత్రీశ్వర చూపుట ధిక-ధర్మను గాదే॥ ౧౬౫॥

వ. అని పలికి యంతనిలుఁవక॥ ౧౬౬॥

క. పాలకు నిరీతి నో భూ।
పాలక భార్యాసుతులకుఁ-బాపితివి పుడీ।
వాలినిఁ జెప్పెడిదేమీ।
వాలిని బిడ్డలను గూడి-యాలకు దెసుఖినై॥ ౧౬౭॥

వ. అని పలికి వెండియు ననేకవిధంబులం బలవించుచుండె నయ్యవసరంబున॥ ౧౬౮॥

చ. అనుజుఁడ చింతఁదక్కు పర-మాదరణంబున నాదు వాక్యముల్
విన్నము నుదుర్వివేకినయి-నేయువిధంబుల నిన్ను బోధనై,
ట్టిన ఫలమీవిధంబునను టెంచెనకుంచుము దానివీని నా।
తనయునిఁ బూర్వమత్కృతవి-ధంబుఁ దలంపక పోవిపుచ్చిదయన్॥

వ. అని తనయునకుం దగిన వచనంబులు వెండియు నుపన్యసించి యొప్పగించి తమ్ముఁడా నీకు సర్వంబునకు రాముండె కలండని నిశ్చలాంతఃకరణంబున రామచంద్రున కభిముఖుండై। ౧౭౯॥

క. కలలో నెవ్వని పదములు।
దలఁచిన నఘచేతిపగుము-దవరుచునుండుం।
గలలోకములప్పదములు।
గలలోకైకనుతు నిన్నుఁ-గంటి స్వంటిన్॥ ౧౮౦॥

మ. అని తద్దివ్యపదాంబుజద్వయము మరం-దాసక్తహృద్భృంగమై।
ర్తినుఁ దైత్యఘ్ననిరాకరింపభవహ ర్త్రా రామశ్రీ రాముఁ డా।
ము నన్నుత్కృష్ణాకటాక్షమున సు-స్నానిం ఘుముం జుందోరం।
గనో గింబ్రాణము తేనుఁ బొర్లుమను సు-గ్రీవాగ్రజాండోత్కటన్॥

వ. ఇవ్విధంబున సకలసద్గుణశరధియగు దాశరథిశరపాతపాతితపాతకుండగు నతండు॥ ౧౮౧॥

గీ. ఫలములాకులుదిని దిగంబరతఁ దిరుగు।
నట్టివనచారులే గను-నట్టి గతికి।
ఫలములాకులుదిని దిగం-బరతఁ దిరుగు।
నట్టివనచారియయ్యెఁ దా-నపుడు చనియె॥ ౧౮౨॥

వ. ఇట్లు దివిజరాజనందనుండు దివిజరాజ రాజధానిం బ్రవేశించుటయుం బ్లవంగాంగనలు నింగివగుల వగలం బొగిలి రంతుఁ దార శతారాయుధనందనుం దలంచి. ౧౮౩॥

క. భిదురనిభాంబక రామా।
ప్రదరంబున రంబుఁ గాడి-పడి పోయితివా।

పదరవినుతుఁడార్వఁగనా।
మదినపగతశూరధూర-మణియనితలఁతుఁ గా॥ ౧౬౪॥

క. ఆహారమెడలికదుము।
స్వాహారతనివ్యథనూన-నలఁగినెయిచ్ఛా।
తాహా నా బాహాబల।
మాహవమునఁ గుపటవిజిత-మయ్యెనః కటా॥ ౧౬౫॥

వ. అని మఱియు నతనిగుణంబులెన్నించి యగ్గించి పొవయుచున్న సమయంబున. ౧౬౬॥

ఉ. రామునియాజ్ఞ లక్ష్మణుఁడ-రాతిభయంకరు నాంబ సేయును।
ద్రాముఁ బురస్కరించికొని-తారనుదారకుమారకుం గపి।
స్తోమమువర్క నందముని-స్తోంపగుమాటలనూరడింపఁగా।
గ్రామతనూభవుస్తృతవి-ధానమునందహీయింపు మపూర్వకంగా॥ ౧౬౭॥

వ. సుగ్రీవుం డంగదుం బురస్కరించికొని సమస్తవానరచమూసమేతుండై సముత్పాటిత రామసాయకుండగు వాహరనాయకుం దగ్గఱి దగ్గుత్తిక వెట్టి యేడ్చుచు నొకింతసేపునకు ధైర్యంబుఁజిక్కఁబట్టి యకుఁకలాపంబుఁ బవిత్ర జలపరిప్లుతంబుఁ గావించి గంధమాల్యాద్యలంకరణ శోభితంబుఁగా నుచిత వాహనంబున నిడి బలవంతులగు బలీముఖప్రకరంబు మోచికొనిరాఁ జైత్ర భూపరిసరకాననంబునకుం జని యుక్తక్రమంబున శిబికడించి చందనాదిక సౌరభ పదార్థసంచయంబుఁ గూర్చి పేర్చఁశోకంబునం జితిపేర్చియప్పాడపై వాలికళేబరంబుఁ జేర్చి యప్రదక్షిణంబుఁ గాఁదిరిగివచ్చి శిరఃప్రదేశంబున నంగదప్రయుక్తయుక్తంబగు సప్తార్చిఁ బ్రవృద్ధార్చిఁ గావించి విరక్తియుక్తులాడుచు నుచిత క్రమంబున నగ్నికార్యంబునడపె నంత వానరవధూవిలాపంబు లొక్కమొగిం దికుకల్ద్రుమవనికఁ బిట్టిల్లె నందుఁ దారమనోవల్లభు నుద్దేశించి॥ ౧౬౮॥

ఆ. అతులసుందరాంగ-యతుఁడవు మఁకార।
రతిఁగరంచసంగ-రంబునందు।

హారిహారథస్థ మయూఖోల్లసితవేయుకు—
టకటరాజమాళి-యంబ కాగ్ని॥ ౧౮౯॥

క. అని మఱియుఁ బెక్కుఁ దెఱఁగుల
ననిమిషపతిసుతుఁడఁ బొగడి-యార్చెడుతారం
గొని పంపాతీరమునకుఁ
జనిసుస్నాతులయి రద్రి-చరవరులెల్లన్॥ ౧౯౦॥

వ. ఇట్లు పవిత్రస్నానంబులు గావించి॥ ౧౯౧॥

క. వలయుఁ దిలోదకములు ని
ర్మలభక్తిన్ సంగి షోడ-శమహాదానం
బుల నన్నదానములఁ దృ
ప్తులఁ జేసిరి బ్రాహ్మణులఁ గ-పులఁ దగురీతిన్॥ ౧౯౨॥

వ. మఱియు సర్వవానరేంద్రున కమరేంద్రలోక చిరనివాసకరంబుల
గు కరణీయంబు తెన్నయేని నడిపి యుంచి విశ్వపనోదార్యం బప్పా
ప్యానదీతీరంబునఁ గొన్ని దినంబులున్న యనంతరంబున రవినంద
నుండు రఘునందన చరణారవింద సందర్శనకందళిత హృదయా
నందుండై చని॥ ౧౯౩॥

క. అంగదునిం గూర్చి ప్లవం
గాంగనలంబులికినవి పి-యంగము పొంగా
రంగుముదరిపుసూతుఁడు స
ర్వాంగాలింగితవసుంధ-రావలయుండై॥ ౧౯౪॥

భుజంగప్రయాతము.

ప్రణామంబుఁ గావింప-రాముండు సంచ
ద్ఘృణానందహాసప్ర-కీర్ణాననుండై
గుణాఢ్యుం బవిత్రాత్మ-కున్ భానుబాలావహున్
మృణాళోరుబాహాద్వ-యుం గ్రుచ్చియెత్తెన్॥ ౧౯౫॥

వ. ఇట్లు గాఢాదరపూర్వకంబుగా గౌరవించి కరుణారస సముద్రుం
డగు రామభద్రుండు పవనతనయానుజాలంగనంబుఁ గొని॥ ౧౯౬॥

ఆ. వాలిచేతమున్న - పాలితంబగు కపి
రాజ్యమనఘుని నజుఁ - బూజ్యలీల
నాచరింపుఁ డాభి - షేచనశోభనం
బింకఁ దడవు సేయ - నేలమునకు॥ ౧౯౭॥

క. అనవిని సౌమిత్రి పవన
తనయులు రఘుతనయుల జూని - తనయుండును దా
క్కానక పియూధపులుం జ
య్యన నాతనిఁ జుట్టుముట్టి - యతులితలీలన్॥ ౧౯౮॥

ఉ. బాంధవమొప్పఁ గూడికొని - బంధురతూర్యరవంబులుప్పతిల్
సింధురకర్ణఘోషములఁ - జెందఱుపందఱ సేయునట్లుగా
గంధిత వానరుల్ను జువ - నల్లనఁ దోడ్కొని వచ్చిరప్పురిన్
గంధకదేహశోభలరు - చిప్రతిభానుని భానుసూనునిన్॥ ౧౯౯॥

వ. ఇట్లు తోడ్కొని వచ్చి.

క. శ్రద్ధఁ బ్లవంగాంగనలు స
మిద్ధగతిని వాలిసుతుని - నినజుఁడు సొచ్చెన్
స్వాగ్రాంతఃకరణుఁ డనుచు
శుద్ధాంతోద్ధసిద్ధ శుద్ధాంతంబున్॥ ౨౦౦॥

వ. ఇట్లు తత్పురప్రవేశంబుఁ గావించె నంతకమున్న పౌరులు. ౨౦౧॥

ఉ. కట్టిరి తోరణంబులెసఁ - గన్నిమముట్టిన తోరణంబులం
బెట్టిరి పూర్ణకుంభములు - మేదురలీల మృదంగ కాహళుల్
గొట్టిరి పుష్పమాలికలు - గుమ్మనఁ దావులు గుమ్మరింపఁగాఁ
జుట్టిరి ద్వారదేశముల - సూర్యతనూభవుఁ డుల్లసిల్లఁగన్॥ ౨౦౨॥

క. ఫలయుతరంభాక్రముకం
బుల నెల్లెడఁ బొందువఱచి పునుగు జవాదిం
గలయంపిఁ జిలికి కస్తురి
నలికి యుడిరి యాణిముత్తి - యపు మును మ్రుగ్గుల్॥ ౨౦౩॥

వ. వెండియుఁ బరమ శోభనంబుఁ గావించి రప్పురవరంబు సమస్త
సంభార సంభరితంబును వారాంగనానృత్తగీత విచిత్రంబునుమం
గళతూర్యరవ సంగతంబును సకలజన నయనానంద కరంబునై క
రంబు విలసిల్లుటయు॥ ౨౯౬॥

ఉ. అంతఁ నంతసంతసహృ-దంబుజుఁ డంబుజమిత్రపుత్త్రిస।
త్యంతమనోహరాంబరన-వాభరణాన్వితుఁ బుష్పమాలికా।
క్రాంతగళప్రదేశుఁ డొసి-కంబుగఁ దోడ్కొనివచ్చి రత్నభా।
భ్యంతరసింహపీఠమున-నాతనిఁ గూర్చిరమాత్యులొప్పుగన్॥ ౨౯౭॥

క. చామరములిడిరి వేల్పుం।
జామలకనవచ్చెఁ బ్లవఁగ-చంద్రముఖులు నీ।
స్త్రీమూభిరామభూషా।
స్తోమరుఝళంఝుళలుసన్న-తులుసేయంగన్॥ ౨౯౮॥

గీ. తివిరి రాఘవుఁడు కృతప్రతిజ్ఞుఁడయ్యెఁ।
గాన నీవును బ్రత్యుప-కారపరుఁడ।
వగుమనుచుఁ బుత్త్రినకుఁ జెల్ప-నరుగుఁగుఁదెంచె।
మిత్రుఁడననొప్ప సఁగసిత-చ్ఛత్రమంత॥ ౨౯౯॥

వ. పట్టాభిషేక సమయంబు సన్నంబగుడు హనుమజ్జాంబవదాదు
లవనీసురనివహయుక్తులై పుణ్యాహవాచనపూర్వకంబుగా హోమ
విధి యథావిధినిర్వర్తితంబు గావించి॥ ౩౦౦॥

చ. కలుషహరంబులంబువులు-గల్గినభూరిసువర్ణ కాంచనో।
జ్జ్వలకలశంబులందికొని-వానరరాజ్యవరాభిషేచనం।
బలవడ నాచరించిరిమ-హాగుణశాలికిఁ బొద్దుచూలికి।
య్యోఘులు రామచంద్రునిద-యామృతముంజిలికించునట్లుగన్॥

క. అమరననురాగశీకిన।
య్యమరులమరనాథునింగ్ర హాధికృతికిన।
ర్యముమున్నభిషేకించిన।
క్రమమునసుగ్రీవు నఖిల కపిపదమునకున్॥ ౩౦౨॥

తనయుని వార్తఁ దెమ్మువిది-తమ్ముగుని న్పెను వాన కాలమం।
దనఘువసింతుసోదరస-హాయతనిగ్గిరిగహ్వరంబులన్॥ ౨౧౭॥

క. కర్కశజనచయనయనో।
త్కర్షమువర్షబుతువగుగఁ-గాఁగపిసేనా।
ఘర్షితభూభాగుఁడవై।
హర్షమునరమ్యకార్తి-కాగమనమునన్॥ ౨౧౮॥

చ. అనుడుఁదదాజ్ఞ వానరస-హస్రసమేతము గాను హాముదం
బునఁబురికేగు దెంచికపి-ముఖ్యుఁడు భాస్కరనందనుండుత।
జనకసుతాగవేషణమునఁ-జాలినమర్కటకోటిఁబిల్వఁబం।
చినిఖిలమంత్రిపుంగవవి-శిష్టసహాయము పేర్మి నెంతయున్॥ ౨౨౦॥

క. రమణీమణియగుతారా।
రమణిప్రియుఁడగుచుభాస్క-రసుతుఁడు మెఱసె।
సుమనధికభూషణమునో।
రమఁగూడి ప్లవంగరాజ్య-రమకధికృతుఁడై॥ ౨౨౧॥

వ. ఇట్లు సంప్రాప్తమనోరథుండై మహాసుఖంబు లనుభవించుచుం
డెనంత నక్కడ రాముండు సౌమిత్రీద్వితీయుండై యు ప్రవర్షణగిరి
బిలంబుల సీతావియోగ సాగరంబునిస్తరింప నుపాయంబు గానక
సంతప్తచిత్తుండై యుండునంత. ౨౨౨॥

క. కాలమునఁదోఁచెఁదొలకరి।
కాలమునిబిరీసకాళి-కాకాలముఁ ।
కాలమతిరిక్తశైత్యము।
మూలము పాంథజనములకు శూలంబగుచున్॥ ౨౨౩॥

క. ప్రాజ్ఞాదుతిజహరులోముజల।
జ్ఞాలాపిహితముదుత-మోమయుము చతు।
ర్దిజ్ఞాలిన్యముచరదహి।
భుజ్ఞాన్యము వర్షబుతువు పోలుఁ బువహించెన్॥ ౨౨౪॥

చ్ఛాదోన్మేదము వర్షబిందులసద-స్త్రింబభ్రమాతంగము।
న్మోదీభూతసమస్తభూతముఁబత-న్ముక్తాసిలేశంబులై।
శోధింపంబడెవానకాలమురణ-క్షోణీతలప్రక్రియన్॥ ౨౩౧॥
ఆ. అఖిలభూతకోటి-కాప్యాయనంబగు।
నట్టివానకాల-మగుడుఁబుడమి।
పట్టిమగఁడు రామ-భద్రుండుజవరాలి।
దగువిరాళిఁదూలి-తాల్మిమాలి॥ ౨౩౨॥
వ. తమ్మునిఁగనుఁగొని॥
గీ. లక్ష్మణక్షణప్రభాప్రభా-లక్షితంబు।
మేఘనిర్ఘోషఘోషస-మ్మిశ్రితంబు।
నతులఝంఝాసమీరస-మావృతంబు।
నైనయీకాలమధికభ-యంబుగాదె॥ ౨౩౩॥
క. పడుఁబిడుగులజడికంటెం।
గడుబెడిదము లక్ష్మయూర-కంఠధ్వనులే।
కుర్కుడుబిసదారుల మెసవిన।
వడిగనమది నెడు నెయెట్టి-వ్రంతలఁబడినన్॥ ౨౩౪॥
క. అనిమతియుం శ్వాసమనుజుఁడ।
పెనుగతిఁబ్రావృట్ప్రయోద-పిహితములగని।
ద్దినములుదుర్దినములుగా।
కనఘాసుదినంబులెట్టు-లగుఁబాంథులకున్॥ ౨౩౫॥
క. అరుగమునాకు స్వ[illegible]ం।
చాఱుగనిహతివోలేఁదాప-మధికముఁజేసెం।
గ్లేశవినాశనిఁజనక।
క్ష్మేశసుతంబాసియున్న-కృపణుఁడనగుటన్॥ ౨౩౬॥
వ అని మఱియుం దద్వియోగకృశానుయోగ సంతప్తమానంబగు మానసంబును సౌమిత్రి హితవచనరచనామృతంబునం దడుపుచుండునంతం గతిపయదినంబుల్లకు। ౨౩౭॥

సీ. ద్యోధునీనిర్మల-పాథోంతరపరిస్ఫు,
టత్పుండరీకషం-డంబులనఁగ।
వ్యోమకేశునిజటా-వ్యూహభాగంబునఁ,
బూసినవెలిబూది-పూఁతలనఁగ,
ఖచరుఁడుడివోవఁ-గానాకసంబున,
నాఱఁగట్టినతెలి-చీరలనఁగ।
దొలుకరిదీజీన-నలమానసముఁబాసి,
పఱతెంచురాయంచ-బాఱలనఁగ।
గీ. మంచుపగవానిగర్భీక-రించినట్టి।
నింగిజవరాలిగండపాం-డిమములనఁగ।
జకితచాతకజాతసం-జాతపాండు।
రాభ్రములుమించెఁ-దచ్ఛరదాగమమున॥ ౨౩౮॥
గీ. భూసతీస్తనగిరులము-న్బూసికొన్న।
లలితకస్తూరికాదంబు-దొలచిఘనసి।
తాభ్రయోజితచందనం-బలదెననఁగ।
నలరెనుసితాభ్రముల్పర్వ-తాగ్రములను॥ ౨౩౯॥
క. అడఁగెస్భేకంబులరొద।
లడఁగెన్సేమంబులంచ-లబ్జాసనములం।
గడఁగెన్విధుండుశరములు।
గడిగెన్మరుఁడేచివిరహి-గణములనెగువన్॥ ౨౪౦॥
చ. కలుషతఁదొల్లితీరములఁ-గాచినభూరుహకోటిఁగూల్చిశ।
తృలుపతనిట్టులయ్యెననఁ-గానదులెంతయునిర్గవంబులై।
వెలవెలఁబాఱఁజొచ్చెనది వింతయనంజనదెట్టుఁగాంచనో।
ద్ధతులుగలవారికిన్ఘనత-దుప్రవిరోధముసేతపాడియే। ౨౪౧॥
వ. అంత. ౨౪౨॥
ఉ. దక్షిణగాములైనజల-దంబులకొక్కఁదరామరుండుప్ర।
త్యక్షముగాఁగఁబ్రసుక్కుచుఁబ్రయాణముమానినవోయనంగఁబ్రా।

గ్దక్షిణభాగమందునన గస్త్యమహోదయమైన మేఘమా।
లాక్షయమయ్యెనంబరమ-హార్నిశలొప్పెశరత్సమాదృతిన్॥ ౨౮౩

సీ. మత్రితతుఁదచ్ఛరదాగ-మంబంతనంతరి,
క్షము వోలె రాజహం-సలఁబెనంగి।
పక్షిరాడ్ధ్వజభూరి-పక్షసలము వోలె,
లాలితకమలాను-కూలమగుచు।
ధర్మాభిరతుసభా-స్థానంబువోలెన,
లక్షితపంకక-లంకమగుచుఁ।
బ్రమథనాయకునిశి రఃప్రదేశము వోలె,
విమలభాసురనదీ-విహితమగుచు।

గీ. దంబుమీఱెడుచంద్రమం-డలము వోలె।
నధికతరచారుకువలయ హర్షమగుచు।
నట్టిజలదాంతసమయస-మాగతప్ర।
చిత్రతరపాత్రశారద-రాత్రులలరు॥ ౨౮౪॥

క. వెరవరిలోకేశుఁడుత।
స్కరజారవ్రజములనెడు-చలిచీమలపై।
నురుగతిఁజల్లినముగ్గను।
కరణిఁగువలయానుమోది-కౌముదిప్రబలెన్॥ ౨౮౫॥

ఉ. అట్టిశరన్నిశన్ హిమక-రాతపమాత్రను నార్తిఁగూర్పఁదోఁ।
బుట్టువు కేలుపట్టు రఘు-పుంగవుఁడాలివిరాలిఁదూలిన।
నెట్టులికింపఁజొచ్చిరతి-భీకరులీస్మరవారిజారులీ।
పట్టునఁబ్రాణముల్విడుతుఁ-బ్రాణములేటికినీతఁబాసితిన్॥ ౨౮౬

వ. అనిపలికి చంద్రోపాలంబన పరుండయి లక్ష్మణుంగనుంగొని॥

క. ఇతఁడమృతకిరణుఁడే కాఁ।
డతివిషముఁడుగాకయున్న-ననుజూఁడదారా।

యుతుఁ గావి నన్ను దాశరథీ!
వ్రాతుఁ డే చందగు నెత్తామి-నీ చరణస్మృతిన్॥ ౨౪౮॥

క. తగ నెందుం గువలయహితుఁ
డగు రాజు కళాప్రపూర్ణుఁ-డగుఁ గాకఁ గడుం
దగ్గని కృశత్వమ్మిల విబు
ధగురుద్వేషికగుఁ గాని-తక్కె నె చెపుమా॥ ౨౪౯॥

క. అకలంకుఁ డసన్మార్గుఁడ
నకుటిలుఁడ నటంచుఁ బొంగు-నమవసఁ గ్రుంగు
స్సకలంకుఁ డసన్మార్గుఁడు
సకుటిలుఁడుం గాన్కఁ డితని-చంద మెఱుఁగవే॥ ౨౫౦॥

వ. క్షీరరాకపోకలు జనంబు లెఱుంగ రయుని వెండియు॥ ౨౫౧॥

ఉ. ఈతఁడు చోరకోటికిని-నిష్టుఁడటందు రకొందఱీతఁడే
ఘాతయొనర్చెఁ బాంథులన-కారణమిమ్మిహిరాంశుఁ డెంతయున్
ద్యోతితుఁ డెంచు లోకములు-దూఱఁగ నెంచుక సిగ్గునొందఁడా
హా తలపోయఁ గార్యుఁడగు-నాతఁడు లజ్జ నెఱుంగఁ డేక దా॥ ౨౫౨॥

వ. అని యివ్విధంబున॥ ౨౫౩॥

క. వనజారిదూరి మీఱిన
జనకసుతా విరహవహ్ని-సమసినధృతిన
మ్మనుజేంద్రుఁ డంత[illegible]ంద
ఱ్ఱని హూర్చి విశేషరోష-పూరితముఖుఁడై॥ ౨౫౪॥

క. తుంటవిలుఁ జిలుక తేజియు
నంటినఁ గసుగందు పూవు-టమ్ము లెవరికిం
గంటఁ బవనిసచివుఁడును
కన్ఁటెనుదుటికంటిమంటఁ-గాగిఁగిన నీకున్॥ ౨౫౫॥

క. అట్టి విలుకాఁడ వీవే
పట్టున విరహిజనహృదయ-పాటనమునకుం

దిట్టవయి తివ్రూహింపఁగ।
నిట్టివి గావే విధాతృ-కృతచిత్రంబుల్॥ ౨౫౬

చ. కటకట పూవుబాణములఁ-గమ్మనివిల్లునుఁ దాల్చి చిల్కతే।
రటు నిటుఁ ద్రిప్ప మన్మరిస-హో యతి నెంతయు దర్పకుండవై।
యుటవిఁ దపంబొనర్చు మధ-రాత్మజఁ బాసిన రాజమౌళిపై।
బటుగతి నేలపోరయొదవు-భస్మము గాఁగ లవంబ కాగ్ని చేఁ॥ ౨౫౭

వ. అని పలికి నిట్టూర్పునిగుడించి. ౨౫౮

క. తమ్ములశోకమ్ములుఁ గుం।
దమ్ములు అందమ్ములగు చుఁదన రారెడు చూ।
తమ్ముల నేయుకుననుఁగుము।
దమ్ముల నేయుమటులైనఁ-దనువుఁ దొలఁగుదున్॥ ౨౫౯

క. అనిమతి పేయునివ్విధంబున।
వనజారింపూఁచిదూఁచి-పేను భేశుఁడు మొ।
ల్లనిచల్లని గాడుపుఁబి।
ల్లని తాఁకునశోకవకఁ జ-లంబతి పలుకున్॥ ౨౬౦

చ. అనిలుఁడ విన్ముఁ నన్నహర-హంబుననంతుఁడు పట్టి మింగనా।
తనిజరరాగ్ని నింపుకయు-దగ్ధము గాక తదాస్యవిస్ఫుర।
ద్ఘనవిషవహ్ని లోదుపడఁ-గావిగ హిబ్రజశుష్కకాననం।
బనయుశ నేర్చి పేర్చుదుద-యా పరిహీనుఁడవు గ్రమూర్తివై॥ ౨౬౧

సీ. ఘనజాలముల నెల్ల-గాసిరయొనర్చెద,
వొకచోటఁ గాదునీ-యునికిపట్టు।
జను లెల్లనినుఁ బ్రభంజనుఁ డనిపలుకుదు,
రట్టివారలనైన నెదిరికొందు।
పంతమున పసనుండి-యరుగు దెంచెదుచే,
పట్టిరవాస్వాంబు-బైటనిడుదు।
వురగులకదుపుల-నుండి వచ్చెదు వర,
తేనులఫలంబుల-నుములఁదోతు।

గీ. వాతిపోయెడువిపులాగ్ని - నార్చినీవు।
పీదవారలఁగనుఁగొన్న-బిట్టు వేతు।
పట్టినిప్పుఁజగత్ప్రాణుఁ-డనినపంక్తి।
యాసనుండేమిచతురాస్యుఁ-డరసిచూడ॥ ౯౬౨॥

వ. అనివెండియుఁ బహువిధప్రలాపంబులు గావించుచుఁ బుణ్యభాగ విపులాయతకిసాలరసాలసాలాగ్రంబునం గందుమీఱెడు కీరకి శోరంబునవలోకించి విభ్రమితాంతఃకరణుండగుచు నిట్లనియె.

చ. అలరుఫలోపయోగమువి-హాయసవర్తనముందనర్పను।
జ్జ్వలనిగమాంతవాసమన-వాప్తకులాయతనొందిరాముని౦।
బలుకుటప్రాణిహింసనము-మానుటయిట్లఖిలత్వమెంతయుం।
గలిగినయోశుకద్విజము ఖంబునరాగముఁబూనుటర్హమే॥ ౯౬౩॥

చ. అనుచువిరాళిఁదూలితన-యాలికచాలివినీలిమంబువో।
లినమధులిట్కులంబులురు-లీలసుగానమువిస్తరించుచున్।
ఘనలతికాలతాంతమృదు-కల్పితడోలికలన్సమీరణుం।
డనుచెలియూఁచనూఁగఁగని-యాతఁడుసీతఁదలంచియార్తుఁడై॥

క. సీతాయుష్మద్విరహో।
జ్జ్వాతానలమెట్లునాకుఁ-జల్లాబుభవ।
చ్ఛీతానుపమానరుచి।
స్ఫీతకటాక్షేక్షణాభి-షేకములేమిన్॥ ౯౬౫॥

క. ఆటుకొదువమరుఁడుకైదువ।
జళిపించెడునట్లునీర-సాలకిసాలం।
బలికచచలింపనెంతయుఁ।
గళవళమందెన్మనంబు-కావందగదే॥ ౯౬౬॥

క. అలనాటినెయ్యములనో।
లలనాయొకనిమిసముంద-లంపకమఱవం।
గలనాశుకశారికల।
కలనాదములిపుడుమనముఁ-గలంపఁగఁజొచ్చెన్॥ ౯౬౭॥

వ. అనిమతియుం దదీయవియోగంబు సహింపక॥

ఉ. తావులుగ్రుమ్మరించెడుల-తాభవనంబులఁదూఱిపువ్వుఁగొ్మ్మ|
మ్మావులనీడకేగునట-మానికొలంకులఁజేరఁబోవున|
చ్చో వెడలుంబరిస్ఫురిత-సూనరజంబునలంటుమేనసీ|
తావిరహార్తి రాముఁడొక-తావునఁగాల్నిలుపంగనేరమిన్॥ ౨౭౦॥

వ. పరితాపంబు నొందుచుం బరిభ్రమించుచుఁ బరవశత్వంబు నొందు టయు సుచితవచన శిశిరోపచారంబులం గొంత సేద దేర్చి లక్ష్మ ణుండు॥ ౨౭౧॥

ఉ. ఏలపరిభ్రమించెదవు-హీనమహాశనికల్పతావకా|
ఖీలశరావలీజ్వలన-భీమశిఖోష్ణసహిష్ణులట్టిది|
క్ష్వాలురుసత్త్వరాప్యగిరి-పాలురుగారటుగానసాధ్వస|
బ్భాలలసాకుమారినృప-పుంగవముందలఁదెచ్చియుంచరే॥ ౨౭౨॥

ఆ. అంతయేలయినజుఁ-డాంజనేయాంగద|
జాంబవత్ప్రముఖర-సాదుహచర|
భల్లుకోత్తములను-బటుగతిఁబిలిపించి|
సీతవెదుకనాజ్ఞ-సేయుమన్న॥ ౨౭౩॥

చ. అనుటయుఁగ్రోధశోకవివ-శాత్ముఁడురాముఁడులక్ష్మణుంగనుం|
గొనికనుఁగొంటివేప్లవఁగ-కుంజరువాలినడంచితన్మహా|
ఘనవిభవంబులిచ్చుటయుఁ-గైకొనిదుర్మదమొంది-వింతయుం|
నసఁదలంపఁడయ్యెనను-మాపతిగోఁతులనమ్మఁజెల్లునే॥ ౨౭౪॥

క. అనిపలికిమతియునతఁడి|
ట్లనుఁగిష్కింధాపురమున-కరిగియతఁడుభూ|
తనయానరయఁబూనుటమఱఁ|
గనిసైపుముకాకయున్న-ఖండింపవనా॥ ౨౭౫॥

మ. అనియిట్లానతియీరయంబునసుమి-త్రాపుత్రోద్భవుండేగికాం|
చెనభోల్లేఖితశాఖికాఫలరస-స్వీకారసమ్మోదన|

ర్తనశాఖామృగశాబకోత్కరయుతా-కార్పింగోయకాంతారము|
ఘృణివిస్తారజితాంధకారముసుగి-ష్కింధాపురీద్వారమున్||
వ. కని చేరంబోవు నవసరమ్మున నచ్చటి ప్లవంగపుంగవులు తమలోన||

మ. అహిమాంశుండుమహోరుదాగమునఁ-బుత్రాలోకనాపేక్షని|
మ్మహికేతెంచెననంగనొప్పెడుజగ-త్ప్రాణ్యుండనంతాభరో|
ద్వహవాత్యంతసమర్థుఁడీతఁడని-తత్స్వంగర్వగాంభీర్యస|
న్మహిమాలోకనదర్శనంబులను-సంభావితాత్ములై చెచ్చెరన్||౨౯||
క. చని సుగ్రీవుం దాశ|
వనితాప్రియుఁ గాంచి మొక్కి-వానరవరులి|
ట్లనిరోదిననాయకసుత|
వినుమొక విన్నపము విన్న-వింతము తెలియన్|| ౩౦||
ఉ. వాసవతుల్యుఁడున్విబుధ-వంద్యుఁడు శక్రధనుఃప్రకారబా|
ణాసనపాణిగోపురస-మాగతుఁడొక్కఁడు గాంచి యెంతయున్|
దాసుమునొందియా తనివి-ధంబుసమస్తమునీకుఁ దెల్పఁ బ|
చ్చేసినవారమాతఁడుఁ బ్రసిద్ధనృపాలతనూజుఁడారయన్||౩౧||
వ. అని పలికి రందుఁగొందఱు. ౩౨||
క. వినుమనుమన వాలిందుని|
మినమనుజేంద్రునకు నీయు-మిత్రకులధ్వం|
సనయాత్రికి వేలుగలుగ|
దనఘుయశ్వినికంటేఁ-గ్రోధనాధకమితనికిన్|| ౩౩||
క. అనవిని సుగ్రీవుఁడు తన|
మనమున లక్ష్మణుఁడతండు-మనుజేంద్రుఁడు వం|
పిన రానొప్పున్నను నే|
మనుజోయిను మన్నసంభ్ర-మాయత్తుండై|| ౩౪||
వ. తారాసమేతంబుగా నెదురువోయి భయభక్తియుక్తిం బ్రణామం
బుఁ గావించియుచితరీతి సమర్పించిన యర్ఘ్యపాద్యంబులం బరిగ్ర

హింప నొల్లక రఘునందనుండు రవినందనున కిట్లనియె॥ ౨౫౫॥

చ. అడవి మెకంబు లెల్లను సహాయము గాఁగ రఘుప్రవీరుఁడ।
య్యెడ విపులార్తి భారము వహించుటఁ దాలిమిఁ బూనియుండని।
య్యెడ విభవాలి రేకము నశీవు దలంపఁగ వైరి మమ్మునె।
ర్వ్యెడ విపినాటు మూర్ఖుఁడ మకిష్టుఁడు నాఁ జన జెట్టు లేరికిన్॥ ౨౫౬॥

క. మాయన్న దుర్దముండగు।
మీ యన్న వధించి రాజ్య మీగొని జడత।
న్నా యన్నఁ దలఁప వైరివి।
మీ యన్నం జూడ బుద్ధి మిగిలె ననీశున్॥ ౨౫౭॥

క. అని బెట్టు పలికి తారా।
వనితాప్రియ బిచన రచన వత్సలుఁ డగుచు।
మ్మనుజేంద్రనందనునకి।
ట్లనియె న్సుగ్రీవుఁడుచిత మగు వినయమునన్॥ ౨౫౮॥

ఉ. ఇంతకుమున్న వానరుల కెల్లను నాజ్ఞయొనర్చినాఁడ వా।
రింత కునంత కుంబు వటు లూనిన కైవడి నేగు దెంతుర।
త్యంత కుతూహలంబు మన కయ్యెడ నూరక చూచుచుండఁగా।
నంత కృతఘ్ను వర్తనుఁడ నయ్యతలం పుము డింపు మగ్రతన్॥ ౨౫౯॥

క. ఏ వచ్చి మిమ్ముఁ జూడం।
గా వేడుక నందు చుండఁ గాని య్యేడకు।
న్నీ వయసు దెంచినాఁడవు।
కావునఁ బోవుద మునృపుని కడకిరు వురమున్॥ ౨౬౦॥

వ. అని తత్తరంబుగా నుత్తరంబిచ్చి యుత్తరణీకులాభరణు చిత్తంబు మె
త్తపడం జేసి యుత్తలంబు దక్కి యత్తయచరోత్తముండు వెండియు॥

క. ఏనైవచ్చెదు పుణ్యాత్మ।
గానన టులఁ గానను చిత గతి నెంత యును।

స్థానంబుదోఁపహాకు।
స్థానవపతికిన్సమాగ-మంబువడపు మీ॥ ౨౯౩॥

చ. అనిసచివాళిఁదోడ్కొనియ-హర్పతినందనుఁడాకుమారుతోఁ।
జనియెనురాముని౦బ్రథిత-శాత్రవగోత్రవిరాముని౦గనుఁ।
గొనినటులేగిరాఘవున-కున్హృదయంబునఁగ్రోధశాంతికై।
మునుమునులక్ష్మణుంబనిచి-మోదముతోనతఁడట్లొనర్పఁగన్॥

వ. మోడ్పుం గేలుఫాలంబునంగీలించి. ౨౯౪॥

క. పదఁపడి తపఃసుతుఁడుతి।
త్పదపద్మంబులకుమ్రొక్కి-ప్రస్తుతులెసఁగ।
న్నదియదయుచుండనపుడ।
య్యుద్ధితేందుసమానముఖున-కొయ్యనఁబలికెన్॥ ౨౯౫॥

క. శాంతగుణాకరచతురా।
శాంతంబులనున్నయద్రి-చరముఖ్యులనే।
నీతకుమునుపిలిపించితి।
సంతోషమువొందుమిపుడ-చనుదెంతురనన్॥ ౨౯౬॥

వ. దీనదయాళుండగు రఘునందనుండు మహానందంబునం దపనసంద నుం దదమాత్యులంగనుంగొని కనుంగొనలఁ గరుణారసంబు జాలువాఱ వారలంగలపికొనియుండె నంతం గతిపయదినంబులకు,

శా. లాంగూలోచ్చలనోదితశ్వసనలీ-లాధూతధారాధరో।
త్తుంగుల్లాంగలదీర్ఘదంష్ట్రులధికో-ద్యుక్తుల్మహీభృన్నహా।
భీలాంగుల్నఖరాయుధోద్ధతులుని-ర్భీతుల్చతుర్దిక్కనగో।
లాంగూలోత్తములేగుదెంచిరిమనో-ల్లాసంబుసంధిల్లఁగన్॥ ౨౯౭॥

వ. మఱియును.

క. దాశరథులకుంగిష్కిం।
ధేశునకున్సంతసంబ హీనతనొంపం।

గీశులు సనుదెంచిరి నా।
కేశసమానబలులవని- యాంచినరణికిన్॥ 300॥

క. గిరిశిఖుఁడు గంధమాదనుఁ।
డరిపంకజ ముత్తమంభి- యగుసగ్గజుఁడు।
న్హారివిక్రముండు కేసరి।
యరుదెంచిరి ప్లవగసైన్య- లైవేర్వేఱన్॥ 301॥

సీ. అపరిమితాద్రిచ- రానీకములుగొల్వ,
నరుదెంచెఁగుముదాఖ్యుఁ- డనునతండు।
కొలఁదివెట్టఁగరాని- కోఁతిమూఁకలతోడ,
నరుగుఁదెంచెఁగవాఖ్యుఁ- డనునతండు।
గణుతింపరానివృ- క్షచరభటాళిఁదో,
డొక్కనివచ్చెనుశరభుం- డనునతండు।
లెక్కయిడఁగఁజాల- లేనివానరులతో,
జనుదెంచెపవడిఁదారుఁ- డనునతండు।

గీ. లలినసంఖ్యాతకీశబ- లసహితముగ।
నరిఘనేతెంచెఁగుంజరుం- డనునతండు।
నరయనంతింతయునరాని- తరుచరాలి।
తనరఁగనుపట్టెనుపనసుం- డనునతండు॥ 302॥

క. వివిధవిపినాటసైన్యప।
రివృతులునరిమధనులునప- రిమితబలులువ।
చ్చివిడిసిరివినతమైంద।
ద్వివిదులునలనీలనలద- ధిముఖప్రముఖుల్॥ 303॥

చ. అతిబలులుగ్రవేగులురు- హాశనికరభీశ దీర్ఘబాహులు।
న్నతతములన్య సైన్యవిపి- నశ్వసనాకృతులిద్ధకేసరీ।
శతబలులైనవృక్షచర- సైనికులెంతయుఁదన్నుఁగొల్వగా।
శతబలివచ్చెఁబద్మహిత- సంభవుపంపినపంపానర్చఁగన్॥ 304॥

క. నల్లని మేనులు నెంతయుఁ
దెల్లని మోరలును గల్గి దిశ లెల్లను భీ
ఝిల్లఁగ బొబ్బలు వెట్టుచు
భల్లూకములతోడ జాంబవంతుఁడు దోఁచెన్ ॥ ౩౦౫॥

క. మానవనాయకభాస్కర
సూనులమన్వంతరంబు-సొంపు వహింపం
గా నేను తెంచెదఁ జూడర
సేనలు దనుఁ జుట్టి రాను సుషేణుఁడు కడిమిన్ ॥ ౩౦౬॥

క. అగ్రజుఁ గనకాద్రిసురల
యుగ్రుఁడు తారకమహిముక-యందును బ్లోలె
వ్యగ్రంబుగ గపిసుభటస
ముగ్రంబునఁ బవనసుతుఁడు-ముఖ్యుండయ్యెన్ ॥ ౩౦౭॥

క. తతవర్షబిందుతారా
తతికంబరమాణుపైక-తలవంబులకు
న్మితి వెట్టుఁ గాక నకపి
వితతిన్లెక్కింపవిధియు-విధిఁబడకున్నే ॥ ౩౦౮॥

వ. ఇవ్విధంబునం గట్టాయితంబగు వనచరచమూసమూహంబు సముద్రజలంబులం బుడిసిలింపను, బ్రహ్మాండభాండంబు వగులింపను గులాచలంబులు విసరివేయనుం జాలి కయ్యంబునకుఁ గాలుద్రవ్వుచుండె నంతయును. ౩౦౯॥

క. అనుపమతరవారిసేనా
ఘననిధిఘనసీలగజగ-వయశరభనిశా
తనఖరకకేసరీవే
ష్టనమునఁ బనసవరతరుప్ర-శస్తతఁ బొలిచెన్ ॥ ౩౧౦॥

వ. భుజబలాంగదుండగు నంగదుండును విపులకపిసేనాసమేతుండై సేనాముఖంబునకుఁ గన్నాకై నిలిచె నట్టియెడ. ౩౧౧॥

ఉ. అక్షులకుం బ్రియంబొదవ-నట్టిప్లవంగము సేరఁ గాంచి యా|
మక్షితినాథుఁ డాదరస-మగ్నుఁడు భాస్కరపుత్రుఁ గాంచి ప్రా|
గ్దక్షిణపశ్చిమోత్తరప-థంబుల జానకి రోయ నెంతయు|
దక్షులబుద్ధి వానరులఁ-దప్పక నిప్పుడ పంపు మింపుగన్ ‖ ౩౧౨‖

క. అనపుడు మహాప్రసాదం|
బనఘయటులచేయువాఁడ-ననికపిసేనఁ|
గనిపొంగి జనకజావిచ|
యనతత్పరచిత్తవృత్తి-నర్కజుఁ డంతన్ ‖ ౩౧౩‖

క. వినతున్వినతాసుతజవు|
వినతుం గని నీవు నూరు-వేలప్లవగులం|
గొని నేర్పునఁ దూర్పునకుం|
జని జనకజ వెదకి రమ్ము-చయ్యన నెలకున్ ‖ ౩౧౪‖

మ. అనితద్దిక్ప్రతభూరిభూభృదురుగో-ష్ఠారామపల్లీగుహా|
ఘనగంభీరసరిత్ప్రవాహములు వే-డ్కం దేటతెల్లంబుగా|
నినజుం డానతియీ నెఱింగి వినతుం-డేగెన్వడిం బూర్వది|
గ్వనితాకర్ణపుటప్రపాటనవిరా-వాపూర్ణసైన్యాఢ్యుఁడై‖ ౧౧౫‖

వ. తదనంతరంబున‖ ౩౧౬‖

చ. అనిలసమానవేగునని-లాత్మజు నాత్మజసన్నిభుం గనుం|
గొని రఘువంశశేఖరుల-కుం దగ నాతనిఁ జూపి వారికి|
ట్లనియె దృఢవ్రతుండు జతు-రాగమవేదియుఁ గామరూపకుం|
డనిలసమానవిక్రమవి-హారి మహాకవిహారి యీరయన్ ‖ ౩౧౭‖

సీ. కనకాద్రి మెచ్చదీ-తని స్థైర్యరమ మించుఁ,
జలధారి దొరకుఁ జే-పడియోననుచుఁ|
దపనుని మెచ్చదీ-తని తేజ మెక్కాల,
మొకరీతి గానుండ-నోడుననుచు|

నుదధిని సరకు సేయదు వీని గాంభీర్య,
మలమంథనగము చేఁ గలఁగెననుచు|
నీమహామహుజవం బీడఁ గాదనునది,
యురుమనోరయమున క్రోపదనుచు|

గీ. నీవటు నితాల్మిభూతధాత్రీవనితను|
గేలిఁ గావించుఁ జంతుప్రసక్తి బోర|
శమనమెదఁ గోరి యొక్క కాసారి బ్రహ్మ|
విష్ణుభద్రాదులగు మొగిఁ బెట్టెననుచు|| ౩౧౮||

క. అంతయు [illegible] తాఁ జూతని|
కాంతిమ[illegible] కంతునిఁ గోరి|
కాంతునకెన[illegible]|
మంతుఁడు ధ్వ[illegible]మంతుఁడంశుమంతుఁడు కాంతిన్|| ౩౧౯||

ఉ. చాలు నితండొకండ కుల శైల సరిద్గహనంబులుండి శా|
పాలపురంబులు న్వెదకి భూమిని సీత నెఱింగి రాయశ|
శ్శాలి మహాత్ము నీతని వెస న్వియమింతునవాగ్దిగబ్ధిస|
త్కూల మహీధ్రభూరుహ నికుంజములన్ మహీపుత్రి రోయఁగన్||

వ. అవిధలికి కరువలి గాదిలి పట్టిఁ గౌఁగిటం బట్టి సస్నేహంబును, స
బాంధవంబును, సగౌరవంబును, సవినయంబును సాదరంబును
గా నతని కిట్లనియె. ౩౨౦||

క. అతిబలకపిసేనాపరి|
వృతుఁడవగుచు యామ్యదిశకు వేచని తగ్గి|
క్షితిధరణి వెదకి రమ్మను|
హితనూజన్మివపరమహితుఁడవు దా కన్|| ౩౨౧||

చ. అనవుఁడు బొంగి నింగినొర యందన వాలము వెంచి భానుజ|
న్మనవనరేంద్రసూనులకు మ్రొక్కి మహామతి యొప్పు వారికి|

ట్లనునిలాత్మజాండు జన-కాత్మజఁ గన్గొనివచ్చువాఁడవు|
బునిధిఁ గడచియైన నుఁ జ-ను న్వదలించియునైనఁ జెచ్చెరన్॥ ౩౨౩॥

వ. అని పలికి॥ ౩౨౪॥

సీ. తత్క్షణము దక్షిణమునకు-దరలనున్న|
హనుమఁ గన్గొని రాముఁడ-త్యంతహృష్ట|
చిత్తుఁడై నిజకార్యసం-సిద్ధి యితని|
కతనఁ గనునని తలఁచి యా-ఘనునుతించె॥ ౩౨౫॥

క. మూఁకకెండియునప్పవ|
మానసుతుం బొగడి రాము-మహినాధుఁడు ప్ర|
జ్ఞానిధి జనకజకుం బ్ర|
జ్ఞానార్థంబాంగుళీయ-కంబొసఁగుటయున్॥ ౩౨౬॥

వ. స్వామికార్యధురంధరుం డగు గంధవహనందనుండు గంధగజంబు తరుణకిసలయంబుఁ బరిగ్రహించు చందంబున నయ్యంగుళీయకంబుఁ గరంబు రాగంబుమీఱం దక్షిణంబ దక్షిణకరంబు సాచి.

క. కొనివానివాక్యములనూ|
కొనివానరసమితిఁ గూడి-కొనివాకలవీ|
డ్కొని దక్షిణపథముంగై|
కొనియోగస్తోదములమి-కొనిపొచ్చింపన్॥ ౩౨౭॥

వ. ఇట్లనిలనందనుండనంత సత్వసంపన్నులగు నలనీలగజగవయ గవాక్ష గంధమాదన దధిముఖాంగిద జాంబవదాది మహావీరపరివృతుండై యుల్లసితంబులగు బుడమిపట్టిం గనిపట్టి వచ్చుచుఁ బ్రతినపట్టి చనియెనంత॥ ౩౨౮॥

ఉ. ఆదశకన్నయుఁ జ్ఞాతమహా-మహిభృత్సరసీవనంబులు|
త్యాదరమొప్పఁ దెల్లముగ-నతిరేకిన్వహించి భీమసం|
పాదిప్లవంగసైన్యమున-పారముఁ దోఁచుడనంపె నా ప్రతీ|
చీశసితంబుఁ గడఁగ సు-షేణుని వైరిపనీకృశానుఁడన్॥ ౩౩౦॥

క. అతనికినొకమాసంబు।
నిధి వెట్టియనంతరమున-మిహిరసుతుఁడుద।
గ్రత పర్వతగహనాదులు।
వితతమతిం దెలిపి రామ-విభుఁడనుతింపన్। ౩౩౧॥

క. ఒక్కొకడ చాలి నాలుగు।
దిక్కులు వెదకంగఁజాలు-ధీరులఁ గపులం।
టెక్కొండ్రఁ దోడు చేసియు।
దక్కకుభంబునకు నాశ-తబలిం బుచ్చెన్॥ ౩౩౨॥

వ. అతండు నొక్కమాసంబునం జనకతనయాన్వేషణంబుఁ గావించి మరలు వాఁడై చనితెంచి నిట్లు॥ ౩౩౩॥

క. కాష్ఠామాత్రమునఁ జతుః।
కాష్ఠావిచయనసమర్థ-గతులకపులు వి।
స్పష్టాహంకృతు లెసఁగగ।
రిష్టాత్ములు చనిరి గంధ్వా-రిసుతనరయన్॥ ౩౩౪॥

వ. ఇట్లరిగి॥ ౩౩౫॥

క. తరుచరవర్యులు మునుముఁగ।
దరుణింధరణీతనూజఁ-దడవిరి మిగులన్।
దరులన్నదీనదంబుల।
దరులందిమిరప్రగాఢ-తరులంజములన్॥ ౩౩౬॥

సర్వలఘుసీసము.

మఱియుఁ దరుచరులు-మసలకనవనిజ,
వెదకఁగఁ దొడఁగిరి-వివిధగతుల।
బులుగులు మొకములు-మెఱఁగెడు నెలవులు,
బులుఁగుల రుతములఁ-బొదలుపొదలు।
మరువులుఁ బొదువులు-మలలు మశిలలును,
బొలములుఁ గొలఁకులుఁ-బులినములును।

బురములును పవన-ములు నిష్కుటములుఁ.
నహాలవివరములుఁ-గహనములును|

గీ. మునులుదపములుసలిపెడు-వనములు మఱి|
బరులయోనుకులుఁదలిరులఁ-బరఁగులతలు|
సొటజములునతటములుబ-హుళశిఖరము|
లపరమితభయదకరము-లగుతలములు|| ౩౩౭||

వ. ఇట్లరయుచు వెండియు| ౩౩౮||

ఉ. భానుసహస్రచాయితర-భానుపరిస్ఫుటధాత్రినీఁగకా|
లూవినయంతపట్టయిన-నూనమునొందకయుండునట్లుగా|
జానకిసుర్వరాతినయఁ-జానుగరోసియోజుంగ లేకయ|
వ్వానరులెల్లఁగూడికొని-వచ్చిరి క్రమ్మఁ దైన్యచిత్తులై|| ౩౩౯||

వ. దక్షిణదిశాపరిశోధనార్థంబరిగిన యశోధనులగు హనుమదాదులు తక్కందక్కిన యక్కపులెల్ల నొక్కమొగిం దిక్కులం గాపంజను దెంచి రాజపుత్రి రవిపుత్రులం గాంచి నమస్కరించి తముపోయి వచ్చిన చందంబెఱింగించు వారైయిట్లనిరి|| ౩౪౦||

మ. సితకీర్తిఁ ప్రియులార యోమలఁ ప్రతీ-చీప్రాగుదీచీదిశ|
ధిత శృంగోన్నతపర్వతంబులఁబయ-స్విధ్వాప గాతీరవి|
స్తృతకాంతారములం గుడుంగములధా-త్రీపుత్రిశోధించి వి
చ్చితిమొచ్చోటను వార్తయైనవినమా-సీతానిమిత్తంబుగన్|| ౩౪౧||

క. ఇఁక సెందు వెదకువారము|
వెకలింతుమొ భూతధాత్రిఁ-జెల్లగిలన్న|
ప్తకులాద్రులఁద్రొత్తుమొ వా|
సుకిలోలుకు వెదుకుదుమొయ-శోధనులారా|| ౩౪౨||

గీ. ఆజ్ఞయొసఁగుఁడుమాకని-రంత రాము|
లక్ష్మణులు నినజుండునుఁ-దక్షిణంబు|

వెదుకఁ బోయిన యమ్మహా-వీరవరులు
మిడఁ బ్రాణంబులిడి యుండి-రావనమున॥ ౩౫౩॥

వ. అంత నక్కడ దక్షిణంబునకుం జని వనచరులాలస్యంబుఁ దక్కి-యుంక్కిన ద్రుమాకులు మరలనెక్కి వీక్షించుచుఁ, దడవిన ప్రదేశంబులు వెండి యుం దడవుచు, నేమేమి జనకజం బొడఁగాంతు మని ప్రతినలువట్టుచు రాఘవుండు మహానుభావుండు తదీయకార్యనిర్వాహకుండ సర్వోత్కృష్టుండని యాడుచు హనుమంతుం గొనియాడుచుం జని చని॥ ౩౫౪॥

సీ. కొలకులు శోధించి-కొలఁకుల లేకున్నఁ,
గొలఁకులు బురదగాఁ-గలఁచివైచి
పొదరిండ్లు పరికించి-పొదరిండ్ల లేకున్నఁ,
బొదరిండ్లు బయలుగాఁ-జిదిమివైచి
తరువులు వీక్షించి-తరువుల లేకున్నఁ,
దరువులు వేళ్ళతో-మురలఁ ద్రోచి
నగములు గనుఁగొని-నగముల లేకున్న,
నగములు బిట్టు పెల్లగిలఁ జేసి

తే. గుహలు దగఁ గాంచి సీత తద్గుహల లేమి
గుహలు గగ్గోలువడఁ జిమ్ముకొ్కఁ దుళిల్లి
గనులఁ గిరులను బొదలఁ బొందలఁ గొలఁకుల
గుహలు శోధించి యమ్మహా-మహులు మఱియు॥ ౩౫౫॥

క. సీతాన్వేషణంబు గావించుచు॥ ౩౫౬॥

చ. ఫలములు గాంచి రేఁగి తినుఁ బాఱ భుజింపఁ బువ్వుదేనియ
గొలఁకులఁ గాంచి క్రోలఁ దమకింపరుఁ బెద్దచరించియే వినే
మలసత నొంది నారదున రాకలిదప్పియు లెక్కసేయరుం
గలఁగదు వానకెండకును-గాలికిఁ గార్యభరంబు బెంపునన్॥ ౩౫౭॥

సీ. అచ్చోటఁ జనకజ నరయుచు మునిపోఁడు,
రచ్చోట లేకున్న దైన్యము వహించు।
రాకడ సీత నా-లోకింతు మనిపోఁడు,
రాకడ లేకున్న -నలసులగుడు।
రాచక్కి మహిపుత్రిఁ-జూచెద మనిపోఁడు,
రాచక్కి లేకున్న నలఁతఁబడును।
రందు రాఘవుదేవిఁ-గందు మనుచుఁ బోఁడు,
రందు లేకున్న ను-గుందుచుండు।
గీ. రందుదత్పతిఁ గ్గొందు-మందురకట।
కడచనిరొమాసమందుఁ-గపులుమఱకు।
నార్తిఁబడ నేలతచ్ఛుభ-వార్త వింద।
మందురాకకొంద శ్రీగతి-నందుమఱియు। ౩౪౮॥
సీ. రామునిఁ బల్కకీ-రమణిసీతఁ గా.
నూహించి నిలిచెన-రొక్కమాటు।
దాత హృదయగుల తాతిన్విజానకి.
యోయని మూచెద-రొక్కమాటు।
ఘనకలాపవిహీనఁ-గలకంఠి భూపుత్రి,
యొకొక్కయునితలంతు రొక్కమాటు।
పటునిశాచరవిద్ధ-పక్షిరఘురాము,
నువిదఁగా భావింతు-రొక్కమాటు।
గీ. పోతుఁ బాసితపించుక-పోతిమహిజ।
యున్నదని చేతఁ బోవుదు-రొక్కమాటు।
శూన్యవృత్తులమైరవి నూనుఁ జేరఁ।
జంపునను భీతిఁ గొందఱు-శైలచరులు॥ ౩౪౯॥
ఆ. మఱియు వివిధగతుల-మసలక జనకజ।
యున్నచోటెఱుంగ-కున్నతంబు।

తెల్లమీ మనముల-కిమ్మగు నెలవుల,

కనుచు మోమున దైన్య-మాక్రమింప।

ఆ. నశ్రులురాలనున్న-యంగదుఁ గనుఁగొని।

యఖిలవానరులుమ-హార్తిఁ దూలి।

నిశ్చయముగ నేము-నీతోడివారము।

గాకమానుఁ బోవఁ-గలదె మతిఁ గొను॥ ౩౫౫॥

చ. సమరము రామచంద్రునకు-సమ్మతిగా నొనరించి పుణ్యులో।

కములఁ జటాయువెంతయును సు-ఖంబునఁ బొందిన యట్లు రామకా।

ర్యముననసుప్రపంచముఁ ద-నంబుగ వీడితి మేనిఁ బుణ్యలో।

కమెదురుపమ్మునంబునఁ బ్లవ-గప్రభులాతనిఁ జుట్టియొడ్చినన్॥ ౩౫౬॥

వ. ధైర్యహీనులగుచుండఁగ హనుమంతుండు వారలకిట్లనియె॥ ౩౫౭॥

క. మనము పరమాత్ముఁ డగు రా।

ముని మనమునం బడయ లేని-మూర్ఖులమని యా।

యినజుఁడు నిజకార్యమదం।

దని పీడ్యులఁ జేయుఁ జచ్చి నంజాకున్నన్॥ ౩౫౮॥

ఉ. కావున దైర్యము న్విడియ-కారణమిగ్గిరి గహ్వరంబులం।

జావఁగ నేలనప్పరమ-సాధ్వి విలాసుతిఁ గాంచి పోయి ధా।

త్రీశుమన్ననం బడసి-తేజము నొందఁదలంపుఁ డిట్లనం।

భావిత చిత్తవృత్తులగు-పాలసులట్లతలంక నేటికిన్॥ ౩౫౯॥

వ. అని వెండియు నుచిత వచనంబులం బేర్చి॥ ౩౬౦॥

క. కదఁ గుండు సీత వెదకం।

గ దుగుండు మూఖంబులక్రు-కలితంబులు న।

న్న డుగుండు కార్యమును వెడ।

పడఁగుండు వగిది విహంగ-నాథుఁ డొకఁడొగిన్॥ ౩౬౧॥

వ. సంపాతియును నతండు॥ ౩౬౨॥

